చ్చారు? ధనాశకు లోబడినా రనుకొన్నా, బానిసలకు ధన మెక్కడిది ప్రభూ?'

యశపాలుడు కుంగిపోయాడు కోపంతో చలిపిడుగై నాడు. జయంతి నిశ్చేష్టయై చూస్తున్నది. కాపలా భటులు నాగిని చెప్పినద తా యథార్థమేనని సప్రమాణంగా రుజువు చేశారు——తమ ప్రాణాలు దక్కినందుకు లోలోన సంతోష పడుతూ. రాజు కారాగార రక్షకులను పిలువనంపాడు. ఈసరి కే వారి కీ వార్త చేరింది. తమ పరాకునకు ఎటువంటి శిక్ష అనుభ వించాలోనని సతమతమైపోతున్న వారి కీవార్త అత్యానందా న్నిచ్చింది. వారుగూడా నాగిని చెప్పినది యథార్థమే ననీ, కుమారి జయంతి తమను స్వయంగా అంతఃపురానికి పిలిపించి వాసవుని విషయం మరొక విధంగా చెప్పిందనీ అన్నారు.



క్రమంగా ఈవార్త పటణమంతటా పాకింది. హుటా హుటి నడకతో రాజ్యమంతటా విస్తరిల్లింది. ఎందరో ఎన్నో విధాల వ్యాఖ్యానించారు. యశపాలుడు, అంతఃపుర స్త్రీల వినియోగార్థమే బానిసలను మేపుతున్నాడని శత్రురాజు లన్నారు. వంశపారంపర్యంగా వస్తున్న వైవాహికాచారాన్ని యశపాలుడు ఎలా నిర్వహిస్తాడో చూడాలన్న ఉబలాటం కొందరు ప్రదర్శించారు.

అంతఃపురంలో ఇటువంటి 'ప్రేమ' వ్యవహారం జరిగి నప్పుడు, అది న్యాయసభ ఎదుటపెట్టటమూ, న్యాయసభా నిర్ణ యంప్రకారం ఆచరించటమూ, కుమరువంశీయులు ఆనవాయితీ. అలాగే ఈనాడుగూడా న్యాయసభ ఏర్పాటు చేయబడ్డది.

వేలాదిజనంతో భవనం కిటకిటలాడుతున్నది. ఇతరోద్యోగుల వలెనే యశపాలుడుగూడా మామూలు జనులు కూర్చునే చోటనే కూర్చున్నాడు. ఒకవైపున వాసవుడు నిలబడిఉన్నాడు. అతని కభిముఖంగా రాజపుత్రి జయంతి నిలుచున్నది. రాజ వంశంపట్టున ప్రధానమంత్రి లేచి, రాజపుత్రి సుకుమారి గనుక, నిలుచోలేదనీ, కూర్చొనడానికి అనుమతించాలనీ అభ్యర్థించాడు. న్యాయమూర్తి అంగీకరించలేదు. 'న్యాయస్థానంలోనికి, రాజపుత్రిగా కుమారి జయంతి రాలేదు. దోషిగా కొనిరాబడ్డది. దోషి దోషనిర్ణయమయ్యే తనంతకూ కూర్చొనకూడదు. ఇందుకు న్యాయశాస్త్రం అంగీకరించదు' అన్నాడు న్యాయమూర్తి.

తరువాత సాక్షులను విచారించాడు. జయంతిని ప్రశ్నించాడు. తనేపాపమూ ఎరుగనన్నది జయంతి. ఇదంతా అన్యాయమూ, అధర్మమూ అన్నది. తరువాత, వాసవుని పృచ్ఛించాడు న్యాయమూర్తి.

'ధర్మమూర్తీ!' అన్నాడు వాసవుడు. 'నేను బానిసను. నా యజమాని చెప్పినట్లు నడుచుకొనడం నా విధి నా కర్తవ్యాన్నుండి, నేనెప్పుడూ విముఖుణ్ణికాలేదు. ఒకపనియొక్క పాపపుణ్యాలతో, ధర్మాధర్మాలతో నాకు నిమిత్తంలేదు. యజమాని ఆజ్ఞ అక్షరాలా పాటించటమే నాకు న్యాయం. అదే నాకు ధర్మం.'

'మంచిది' అన్నాడు న్యాయమూర్తి. 'ఈ సాక్షులు చెప్పిన కథనాన్ని, నువ్వుగూడా రుజువు చేయగలవా?'

'మీ రనుగ్రహిస్తే!' అన్నాడు వాసవుడు.

సభ యావత్తూ నిశ్చేతనముయింది.

'ఆపదలో ఉన్నానని, రాజపుత్రి'—జయంతి—'

న్యాయమూర్తి 'రాజపుత్రి' పదప్రయోగం చేయరాదని శాసించాడు.

'సరే' అన్నాడు వాసవుడు 'ఆపదలో ఉన్నానని, జయంతి అబద్ధమాడవచ్చు. అది ఆమెకు, ఆమెవంటివారికి సహజమే ననుకొంటాను...పోనీండి. మరో చిన్న విషయం. నేనెవరో తనకిదివరకు తెలియనే తెలియదని, జయంతి అంటున్నారు. తెలుసుననీ, మా యిద్దరకూ సన్నిహిత సంబంధమే ఉన్నదనీ నేనంటున్నాను. ఒక్క ప్రియునికి దప్ప, మరెవరికీ తెలియజాలని కొన్ని చిహ్నాలు, కుమారి జయంతి శరీరంలో ఉన్నాయి. అవి ఇవి...'అన్నాడు వాసవుడు. 'ధర్మమూర్తులైన మీరు పరీక్షింపించి, నిజానిజాలు తేల్చండి.'

వాసవుడు చెప్పిన చిహ్నాలు అక్షరాలా, ఆయాచోట్ల ఉన్నాయని, జయంతిని రహస్యంగా పరీక్షించిన సువాసినీ జనమన్నది.'

'అదిగూడా కాక' అన్నాడు వాసవుడు. 'జయంతి ప్రస్తుతం కన్యకాదు. కొద్దిరోజులలో ఆమె తల్లి కాబోతున్నది.'

భిషక్కులు, అదిగూడా నిజమేనని నిర్ధారించారు.

యశపాలుడు అవమానంతో మాడిపోయాడు. వాసవుని ముఖాన చిరునవ్వు పొటమరించింది.

'ప్రభూ! ఇంతకన్న మీ కేమి ఋజువులు కావాలి? ధర్మాధర్మాలు ఇపుడు నిర్ణయించండి.'

న్యాయమూర్తి న్యాయమైన తీర్పునిచ్చాడు.

'జయంతి దోషురాలని నేను భావిస్తున్నాను ప్రేమించటం దోషమని న్యాయశాస్త్రమనటంలేదు. రహస్యంగా చేసిన పనినే, బహిరంగంగా, తాను చేయలేదని, న్యాయస్థానంలో అబద్ధమాడింది. ఈదోషానికి, సామాన్యజనులు పొందే శిక్ష నే ఈమెగూడా పొందాలి. ఈమె వాసవుని సొత్తుగా నేను తీర్పు చెబుతున్నాను. కుక్కుర వంశాచారం రీత్యా జయంతి, ఇకనుండి వాసవునిభార్యగా వ్యవహరించాలి. వంశాచార భంగాన్నిసైతం, న్యాయశాస్త్రం అంగీకరించదని హెచ్చరిక.'

# 6

ఈ తీర్పుమీద వాదోపవాదాలు, ఖండన మండనలు, తర్జనభర్జనలు జరిగాయి. కొంతకాలంపాటు దేశదేశాలు ఈ విషయాన్ని ఆగుబ్బుగా చెప్పుకొన్నాయి.

వాసవుడు తనభార్యను వెంటబెట్టుకొని, మామూలు చెరసాలావాసానికి ఆయత్తమయ్యాడు. నిరాకరించే హక్కు—భార్యగనుక-జయంతికి లేదు. అతనితోబాటు ఆమెగూడా చెరసాలలో ప్రమగ్గవలసిందే! అయితే శాసనరీత్యా మరొక చిక్కు వచ్చిపడ్డది. బానిసలపై ప్రస్తుతమున్న కట్టడులు—కేవలం వారికోసంమాత్రమే చేయబడ్డాయి. వాటిని బానిసేతరులపై అమలుజరపటానికి వీలులేదు. ఈరీత్యా - జయంతి బానిసకాదు గనుక, కారాగారవాసం చెయ్యనక్కరలేదు. కానీ వాసవుడు, తన యథాస్థానానికి వెళ్ళితీరాలని పట్టుబడుతున్నాడు. భర్తఆజ్ఞ జవదాటటం మహానేరంగా న్యాయశాస్త్రం ఉద్ఘోషిస్తున్నది.

యశపాలుడు క్షోభించిపోయాడు. ఈసాంసారిక జీవితంపై రోతజనించింది. రాజ్యాన్నివీడి, భార్యాసమేతంగా తపోభూము లకు వెళ్ళాడు. యశపాలుడు పుత్రహీనుడు కావడంతో, రాజ్యం జయంతికి సంక్రమించింది. ఆవిడే పరిపాలకురాలైంది. కానీ రాజవంశ స్త్రీలు పరపురుషుని కంటపడరాదు. [న్యాయ విచారణ సమయంలో నలుగురి ఎదుటపడటమనేది, ఈ కోవ క్రిందికి రాదు. తీర్పు కాబోయేవరకూ, ఎవరు పరపురుషులో, ఎవరు స్వీయపురుషులో ఎలా నిర్ణయించటం?] ఆమె ప్రతినిధిగా వాసవుడే పరిపాలనాభారం వహించాడు.



అప్పటినుండీ రాజ్యపాలకులుగా బానిసలు వచ్చారు.

రాజ్యపాలకుడుగా వచ్చిన ప్రారంభకాలంలో, కొన్ని కఠినమైనశాసనాలను వాసవుడు అమలుజరిపాడు తనరాజ్యంలో ఎక్కడా 'బానిస' అన్నపదప్రయోగం చేయరాదనీ. ఏరూపంలో ఎక్కడ, ఎప్పుడు ఆశబ్దం ఉచ్చరింపబడినా కఠినంగా శిక్షింప బడతారనీ శాసించాడు. శాసనధిక్కారులను క్రూరంగా అణచి వైచాడు. ఉచిత విద్యాశాలలు దేశమంతా నెలకొల్పాడు) అందరితో కలిసి సారంగజాతీయులు (బానిస నారీమణులుకాదు. సహవిద్య నభ్యసించారు. దానధర్మాలు వారువీరనక చేశాడు. సంగీతసాహిత్యాది లలితకళలను సమాదరించాడు. దయానిధిగా పేరుపొందాడు. కానీ వాసవుడెప్పుడూ, ఏదో మనోవ్యధతో కుములుతుండేవాడు. జయంతితో, అతడు వైవాహికసుఖ మపే క్షింపలేదు. కొన్ని సంవత్సరాలవరకూ ఆమెను నీడనుగూడా చూడలేదు. తనజాతి స్త్రీని వివాహమాడి, సంతానాన్ని

పొందాడు. అసంతానానికే రాజ్యము అప్పగించాడు. జయంతి పుత్రుడు—(వివాహంనాటికే రాజపుత్రి గర్భిణి. ఈ విషయం న్యాయస్థానంలో వెల్లడయింది. ఈబిడ్డకు తండ్రి—ఒక్క జయంతికే తెలుసు. తెలుసుకోవాలని వాసవుడెప్పుడూ ప్రయత్నించ లేదు.) సారంగులచే చంపబడ్డాడు. కుకురువంశం జయంతి నిర్యాణంతో అంతమయింది. తను ఈస్థితికి కారణభూతమైన జయంతి పేరుతో వాసవుడు ఒక మహానగరం కట్టించాడు. తన రాజధానిని స్వర్ణపురినుండి జయంతికి మార్పించాడు. ఆ తరువాత వచ్చిన సారంగప్రభువులుగూడా జయంతినే రాజధానిగా చేసికొని తమ భక్తి ప్రపత్తులను వెల్లడించారు.



మృత్తికా పత్రాలలో ఇంతవరకే విషయం లిఖించబడి ఉన్నది. కాలనిర్ణయంగూడా దాదాపు నిర్ణయించటం జరిగింది. నడివీధుల్లోనూ, ఇతరచోట్లా లభించిన ఆయుధ శకలాలనుబట్టి చూస్తే, అవి అశోకుని సైనికులవిగా తోస్తున్నది. ఆకాలంలో, మరే సైన్యానికీలేని విచిత్రమైన ఆయుధ సంపద అశోకునికుండే దని చరిత్ర చెబుతున్నది. చరిత్ర వర్ణించిన అన్నివర్ణనలూ, ఆయా ఆయుధ శకలాలకు సరిపోలుతున్నాయి. దూషణతో కూడిన తామ్రాది శాసనాలుగూడా అశోకునివే అయివుండాలని విజ్ఞులు భావిస్తున్నారు. అశోకుడు రాజ్యపాలనమునకొచ్చిన విధానాన్నిబట్టి అలా కవ్వించి, కదనంలోకి దింపి, సర్వనాశనం చేయడం అశోకునికి క్రొత్తకాదని బోధపడకమానదు. నగరాన్ని భస్మీభూతం చేసిందిగూడా అతనేనని, అశోకుని చరిత్రవల్లనూ, ఇతరాధారాలవల్లనూ తేటతెల్లమవుతున్నది. కళింగ

రాజ్యంవరకూ వొచ్చుకొచ్చిన అశోకుని సైన్యాలు, జయం తిని పొట్టబెట్టుకోనకుండా ఉండటం అసంభవం!

అయితే ఈ సారంగ రాజ్యాస్తమయం, క్రీస్తుపూర్వం మూడవశతాబ్దిలో జరిగినదన్నమాట. రెండువందల సంవత్స రాలు (సుమారుగా) సారంగులు పరిపాలించాలంటే, వాసవుడు క్రీస్తుపూర్వం అయిదవ శతాబ్దంవాడయి ఉండాలి. జగత్పూ జ్యుడైన గౌతమబుద్ధుడు ఆ శతాబ్దంవాడే!

ఒకటిమాత్రం నిజం! ప్రతితరమూ తనకుకావలసిన వారిని తనే సృజించుకొంటుందట. అయిదవ శతాబ్దంలో, అమానుషమైన అటువంటి సామాజిక విధానం ఉండబట్టే, కరుణాసింధువైన గౌతముడుద్భవించాడేమో!

# జీవచ్ఛవం

సీతకు నిద్రపట్టడంలేదు. మంచంమీద అటూ ఇటూ పొర్లింది. దిండు అనేకరకాలుగా మార్చింది. మంచం అన్ని మూలలకూ తిప్పింది. అరగంటసేపు ప్రయత్నించింది. పాపం సీతకు నిద్రిబట్టనే లేదు.

అప్పటికి రాత్రి పదిగంటలయింది. మెల్లిగా లేచి కిటికీ లోగుండా బైటికిచూసింది సీత. నవమినాటి గోము వెన్నెల ప్రియురాలి చిరునవ్వులమల్లే వుంది. చెట్లలో యిరుక్కునివున్న చీకటి బరువుగా వేళ్ళాడుతోంది, హిందూసంఘపు నీతికిమల్లే! సన్నగా మంచు కురుస్తూవుంది. దూరపు నగరంలోని విద్యుత్ కాంతులు కొండపక్కగా శ్వేతగా వెలుగుతున్నాయి. దూరంగా ఒక కుక్క అరుపు గాలిలో మెలికలు తిరుగుతూ గీరుకుపోతూ వుంది.

"ఇప్పటికి అతను హాయిగా నిద్రపోతుంటాడు" అను కొంది సీత.

కానీ అది అనుకోవడంగాదు. పక్కనే ఎవరన్నా వుంటే ఆమాటలు ఖచ్చితంగా వాళ్ళకు వినిపించివుండేవి. కొంచెంగా గాలికూడా సాగింది. ఆగాలి దురదగొండాకు పొడికిమల్లేవుంది సీతకు.

"ఛీ ఛీ" అనుకొని వెనక్కొచ్చింది

సీత వెనక్కొచ్చిన మరుక్షణంలో పెద్ద సుడిగాలి స్వరవ దూసుకొని కిటికీగుండా గదిలోకొచ్చింది. సీతకు గాలిమీద

చెడ్డకోపమొచ్చి కిటికీ వెయ్యబోయింది. అంతలోకి గదిలో కొచ్చిన సుడిగాలి మంచులాగా కరిగి వొకమనిషి ఆకారాన్ని ధరించింది. సీతకు భయంవేసింది. గుండెలు 'లబలబ' మన్నవి, వణికిపోయింది పాపం సీత.

సీత కంగారుచూసి ఆకారం నవ్వింది.

"భయపడబోకు సీతా!" అన్నది.

మనిషిమాదిరి మాట్లాడినందుకు సీత అంతగా భయపడ లేదు. ఇది దయ్యంకాదని సీత నిర్ధారణ చేసుకుంది.

"ఎవరు నువ్వు?" అన్నది సీత.

"నన్నే ఎరగవ్?" అన్నది ఆకారం.

సీతకు నవ్వొచ్చింది. తనెవరో తెలిస్తే ఎందుకడుగు తుంది? తనకు వెర్రా ఏమిటి?

"నీపేరేమిటి?"

"సీతమ్మ"

"నాపేరేనే!" అనుకొన్నది సీత.

"అతన్నిగురించేనా ఆలోచిస్తున్నావ్?"అన్నది ఆకారం.

"ఎవరు?"

"అదే...మూర్తి"

"ఎవరు చెప్పారు?"

"నాకు తెలుసు"

"నిజమే!"

"మరి పోలేదేం?" అన్నది ఆకారం వెటకారంగా.

"పోవాలి"

"నీకు పరువు అక్కర్లేదా?"

"కావాలి"

"మర్యాద?"

"కావాలి"

"గౌరవం, సంఘం?"

"కావాలి"

"అయితే నీమనసుని మార్చుకో"

"వొద్దు"

"ఎందుకని?"

"నా కా శక్తి లేదు"

"వుంది"

"నావల్లగాదు"

"అబద్ధం"

"నిజం! అతన్నాకు కావాలి"

"ఓహో"

"అతన్ని నేను కోరాను"

"ఆహా"

"ఈ ఆవేదనకి, ఆరాటానికి అతను నా క్కావాలి"

"అయితే వాటి శాంతికి...?"

"అవును"

"ఎంత నీచం?"

"కాదు"

"ఎట్లాకాదు? అయితే అది మంచిదా ఏమిటి?"

"మరి కాదా ఏమిటి?"

"నాకు తెలీదులే! అంత బిగ్గరిగా నేనాలోచించలేను. పోనీ చెప్పు, నీవరాల పీనుడుగ్గాను కట్టుకొన్న భర్తకు ద్రోహం చేస్తానంటావు, ఏం?"

"ఆపని చేయకపోవడంవల్ల నాకు నేనే ద్రోహం చేసుకున్నదాన్నవుతానేమో! నాకు జరిగే ద్రోహంకంటే నా మొగుడికి జరిగే ద్రోహం పెద్దదని నేననుకోలేదు"

"........."

"అతనికోసం నా ప్రత్యణువూ క్షోభిల్లిపోతూవుంది"

"నీపరిత్యణువు క్షోభిల్లిపోతూన్న ప్రతివాడితోటీ నీవు తిరుగుతానంటావు. ఆవిధంగా జీవితాన్ని నడుపుకొంటూపోతే నీభవిష్యత్తేమిటో,ఎట్లా వుంటుందో ఆలోచించావా?"

"ఆపరిశ్నకు అర్ధంలేదు ఎందుకనంటే ప్రతివాణ్ని చూసి నప్పుడూ, అనుక్షణం క్షోభగా వుండదు. కొంతమందిని—మన స్సును అందుకోగల వున్నత వ్యక్తులను చూసినపుడుమాత్రమే అది సాధ్యపడుతుంది. అటువంటిది నిజంగా జరగటమనేది చాలా అరుదు"

"నిజమే కావొచ్చు. దాన్ని నువ్వు జాగర్తచేసుకో వాలి...చూడు సీతా! ఇది కేవలం నీ క్షేమంకోసం చెబుతు న్నాను. ఆలోచించు జాగర్తగా. అతను నిన్ను నలిపేస్తాడు. నీఅందాన్ని అనుభవించినంద బారులుబారులుగా నాక్కి కొద్ది రోజుల్లోనే నిన్ను కురూపినిగా అసహ్యంగా తయారుచేస్తాడు. నీయవ్వనాన్ని దోసిళ్ళకొద్ది పీల్చి పిప్పిని బైటికి విసురుతాడు. అప్పుడు నీగతేమిటి? పడుపువృత్తికి కూడా పనికిరావు..."

"అంతదాకా రాదు."

"ఉండు—ఎందుకు రాదు? అతను కోరింది నీఅందాన్ని, యవ్వనాన్ని, శరీరాన్ని. అది కొద్దిరోజుల్లోనే అతని పాదాల క్రింద వొంపులుగా నొక్కబడుతుంది. నిజం"

"అయితే నాభర్త చేసేదీ అదేగా! అయినా నాకు కావలిసింది అదే!! దాన్నే నాభర్తనుండి పొందలేకపోతున్నాను. నాభర్తకా శక్తిలేదు. ఉద్వేగాన్ని వుపశమింప చేసుకోవడం నాకర్తవ్యం. దానికోసం పెద్దలు, సంఘం నాకొక మొగవాణ్ణి యిచ్చారు. తన కర్తవ్యాన్ని అతను నెరవేర్చలేకపోతున్నాడు. అందుకని నాకర్తవ్యాన్ని నేనెందుకు తోసెయ్యాలి? నాభర్తయొక్క తప్పుకుశిక్ష నేను అనుభవించడమెందుకో నాకు అర్థంగాకుండా వుంది."

"అవును, అర్థంగాదు పాపం! వాడు నిన్ను నలిపి, పీల్చి, తన కామాగ్నిలో నిన్ను బూడిదచేసినరోజున! ఆ బూడిద కుప్పలు చూసినప్పుడైనా నామాటలు నీకు అర్థం గాకపోవు..."

సీతకు హఠాత్తుగా జ్ఞాపకమొచ్చింది మధ్యలో ఎవరీ వ్యక్తి? సీతకు ఆ వ్యక్తి ఎవరో తెలీదు. ఆకారం సీత భవిష్యత్తు. జవాబులిచ్చింది సీత వర్తమానం. వర్తమాన భవిష్యత్తులే యింతసేపూ ఘర్షణపడినాయి. సీత నిర్లిప్తంగానే వుంది. వర్తమానం వయస్సు 20 ఏళ్ళకు కొంచెం ఎక్కువ. భవిష్యత్తు వయస్సు 45 కు కొంచెం తక్కువ అప్పటికి.

"చెడిపోతావ్! మార్చుకో!"అన్నది ఆకారంలోవున్న భవిష్యత్తు.

"మారదు" అన్నది నిశ్చలంగా సీతలోవున్న వర్తమానం.

"మారదు! మారదు!! మారదు!!!"

"చూస్తాను"

ఆకారం కుడిచెయ్యిని వలయంగా తిప్పింది. అంతదూరమూ బ్రహ్మాండమయిన మంటలు లేచినవి. ఆ మంటలచివర యమలోకం వెలిసింది. పాపుల (?) మొహాలకు వారివారి దోషాలను తెలిపే అట్టలు కట్టబడివున్నవి. ఒకావిడ మొఖానికి "స్వేచ్ఛాప్రియ" అనేఅట్ట తగిలించివుంది. ఒక భటుడు (రవివర్మ గెటప్) ఆవిణ్ణి కత్తితో పొడిచాడు. సలసల వేగే నూనెలో వేయించాడు. మండ్రగబ్బలచే కరిపించాడు, యినప గద్దలతో రక్కించాడు. రెండుకాళ్ళు పుచ్చుకొని పైకెగరేసి కింద ఎర్రగాకాలిన బల్లెం పెట్టాడు "స్వేచ్ఛాప్రియ" రివ్వున వొచ్చి కసిక్కున దానికి దిగబడింది.

"హా!"

వర్తమానం మూర్ఛపోయింది. భవిష్యత్తు వలయాన్ని వుపసంహరించింది. మంటలు ఆగిపోయినయ్. యమలోకం అదృశ్యమైంది. ఆకారంలోవున్న భవిష్యత్తు మంచులాగా కూడుకుని సుడిగాలిలో కలసి సర్రన కిటికీలోగుండా దూసుకొని బైటికి వెళ్ళింది.

అరగంటకుగానీ వర్తమానం తేరుకోలేదు. అప్పటికి సముద్రంలోని నీరు వుప్పు. చంద్రుడు వెన్నెల కురుస్తూనే వున్నాడు——

ఇంతవరకూ నిర్లిప్తంగా వున్న సీత వొణికిపోయింది.

"ప్రాణనాయకా! క్షమించు" అంటూ తనుఅసహ్యించుకొన్న మొగుణ్ణే గట్టిగాకావిలించుకొని కళ్ళుమూసుకొంది సీత.

# వ్రీడావతి

ఇక ముందుముందు ఎట్లా అఘోరిస్తుందో తెలియదు గానీ, ఇప్పుడుమాత్రం కాంతమ్మకు వల్లమాలిన సిగ్గు. ఆసిగ్గు పడటమనేది దాని ముఖానికి చక్కని తీరును ప్రసాదించ గలిగే మాట నిజమే! కానీ ప్రతిపనిలో గూడా అది ఆ సిగ్గును ప్రదర్శిస్తూంటే ఎట్లా?

అమ్మ పొద్దున్నే లేచింది. అప్పటికి కాంతమ్మ లేవనే లేదు. లేపుదామని అమ్మ గదిలోకి వెళ్ళింది. కాంతమ్మా, బావా పాములకుమల్లే మెలికలేసుకొని పడుకొనివున్నారు. దానిజుట్టు చెదిరి వెడల్పుగా నాచువలె, తెల్లటి దుప్పటిమీద పరచుకొనివుంది. జుట్టుమధ్య దాని మొఖం. ఒంటిమీద గుడ్డ వున్నదో లేదో గూడా తెలుసుకోలేనంత మత్తుగా నిద్రపోతు న్నారు. అమ్మచూసింది. చూసినతరువాత అమ్మకు నవ్వొచ్చింది. కాళ్ళవైపున్న దుప్పటితీసి కాంతమ్మమీద కప్పి వెళ్ళిపోయింది. కాంతమ్మ మెల్లిగామూలిగి, బావను సంపూర్ణంగా చేతుల్లోకి పొదువుకొని మరింత దగ్గిరిగా జరిగింది. బావ రాత్రి వొచ్చాడు. కార్యమయిన తర్వాత బావ ఇది రెండోసారి రావటం. బుల్లోడికి పుట్టెంటికలు తియ్యాలనుకుంటున్నారు నాన్న. అందుకని బావను గమ్మని వుత్తరం రాశాడు.

అమ్మ తనింకా లేవలేదని ఏమన్నా అంటుందేమో! ఏమంటుందేం! పొద్దుపోయి వచ్చాడాయె. అందులో కొత్త మేళమాయె. ముందుగా బావే లేచాడు. లేచి దొంగని దపో

పోతున్న కాంతమ్మను లేపాడు. అది బద్ధకంగా కళ్ళు తెరచి, లేచి కూచుని, రెండుచేతులూ పైకి చాపి, మెల్లిగా వెనక్కు వొంపుతూ వొళ్ళు విరుచుకొంది. కాంతమ్మకు నిజంగా నిద్ర లేచినట్టు లేనే లేదు.

"అప్పుడే తెల్లవారిందా?" అన్నది కాంతమ్మ, దానికి రాత్రంతా రెండునిమిషాలకు మల్లే తోచింది గావును.

"ఇంకా అనుమానంగానే వుందా? కిటికీలోగుండా వొస్తున్న ఈ వెలుతురు తెల్లవారిందనే చెబుతున్నది" అన్నాడు బావ పుస్తకాల్లో నాయకుడుమల్లే.

కాంతమ్మ మంచందిగి అసులుసులుగా వున్న చీరెను సరిగా కట్టుకొంది. జుట్టు గోళ్ళతో సరిచేసుకొని ముఖమంతా అరచేతితో రుద్దుకొని, బైటికి పోబొయ్యేటప్పుడు, బావ వెనకాలే వెళ్ళి రెండుభుజాలూ పట్టుకొని ముందుకు తిప్పి కావిలించుకొన్నాడు. కాంతమ్మ ముఖం పక్కకు తిప్పింది.

"ఈ కాలానికి బుద్ధిలేదు. మరొక నాలుగుగంటలు తెల్లవారకుండా వుండకూడదూ!" అన్నాడు బావ.

బావ అన్నమాటతో కాంతమ్మ సంపూర్ణంగా ఏకీభవించింది. అయినా "ఛా వూరుకుందురూ" అంది. గదిముందు ఎవరో తిరుగుతున్న అడుగులచప్పుడు వాళ్ళకు వినిపించకపోతే అట్టా ఎంతసేపుండేవారో!

బావ స్నానంచేశాడు. గదిలో అద్దంముందు నిలబడి తల దువ్వుకొంటున్నాడు.

"కాఫీ యిచ్చిరా అమ్మా!" అన్నది అమ్మ కాంతను. అమ్మ వంటిల్లు అలుకుతున్నది.

"నేను పోను" అన్నది కాంతమ్మ. అది ఏమాటైనా తెగేసి చెబుతుంది.

"ఏమే! కాఫీ యిచ్చిరావటానికేం? ఆ అబ్బాయి స్నానంచేసి చాలాసేపయింది... వెళ్ళిరా అమ్మా!" అన్నది అమ్మ.

"పాపామను పంపించు. అది ఊరికినే వుందిగా!"

"నువ్వేం చేస్తున్నావ్?" అన్నది అమ్మ, అలకటం ఆపి కాంతమ్మను వెనక్కు తిరిగిచూస్తూ. అది వంటింటి కిటికీలో గుండా బావిమీది పిచ్చికలను చూస్తున్నది.

"ఏంపాడో! నాకు 'సిగ్గమ్మా' నే పోను" బావకు కాఫీ యిచ్చి రావటానికీ దానికిసిగ్గుట, సిగ్గు!

"అయ్యో సంబండం. ఇట్లా అయితే ఎట్లాగే" అన్నది అమ్మ నవ్వి "పాపాం! బావకు కాఫీ యిచ్చిరా అమ్మా"

పాప వొచ్చి కాఫీ తీసుకెళ్ళి బావ కిచ్చి వొచ్చింది. అమ్మ పిలవబట్టి అది వానగుంటల దగ్గిర్నుండి వొచ్చిందిగానీ, ఇంకొకళ్లు పిలిస్తేనా...చస్తే వొచ్చేదిగాదు.

"కాఫీ యిచ్చావుటే?" అన్నది చెల్లెల్ని కాంతమ్మ.

"ఆఁ" అన్నది పాప అక్కయ్యవేపు చూడకుండా నే.

"వక్కపొడి పెట్టావా?"

"ఊఁహుఁ"

"కాఫీతాగి వక్కపొడి వేసుకోరూ? అలమారులో సీసావుంది. కొంచెం పెట్టిరా"

అక్కయ్య మాటంటే పాపాముకు బొత్తిగా లక్ష్యం లేదు. చెల్లెలుఉదాసీనత చూసి, కాంతమ్మ చిటుక్కున దాని

మాడుమీద గొట్టి, పక్కపొడి బావకు పెట్టటానికి వెళ్ళింది. అమ్మ యింకా వంటిల్లు అలుకుతూనే వుంది.

'కాఫీ ఎట్లావుంది?' అన్నది కాంతమ్మ.

"పానకంమల్లేవుంది" అన్నాడు బావ.

"నేను చేశానండీ!"

"అయితే దివ్యంగా వుంది. ఈయింట్లో ఇంత అద్భుతంగా కాఫీ కాచే దెవరా? అనుకొన్నాను నవ్వుతప్ప"

బావ కాఫీతాగి, గ్లాసు అడుగునవున్న నాలుగుచుక్కలనూ, కాంతమ్మ పమిటమీద చల్లాడు. అది పమిటను పూర్తిగా కిందికిజార్చి, దొంగకోపాన్ని అభినయించి, బుంగమూతిపెట్టింది. బావకు బుంగపెట్టే వాళ్ళంటే మహాయిష్టం. అందుకనే కాంతమ్మ తరుచుగా బుంగమూతి పెడుతుంటుంది.

"ఇదిగో! అట్లా మూతిపెట్టుకొని నాప్రాణాలు తోడెయ్యకు. నేను వుండలేను" అంటూ బావ ముందుకొచ్చి కాంతమ్మను దగ్గరగాతీసుకొన్నాడు. అది ఇందుకోసమే ఎదురుచూస్తున్నట్టుగా ఏమీ అభ్యంతరపెట్టలేదు.

"ఊ, పోండి. మీరు రోజురోజుకు మరీ— అబ్బ వుండండి. ఎవరో వొస్తున్నారు."

గదివాకిట్లో ఎవరో వొచ్చినట్లుగా నీడలు కదిలాడినై. కాంతమ్మ రెండుచేతులతోనూ బావను వెనక్కుతోసి బైటకొచ్చింది.

"ఏమోనమ్మా! కత్తిపీట ఎక్కడుందో కనపడలేదు. వంకాయలు దేంతోకోసేది నాబొందతో!"... అన్నది కాంతమ్మ హడావుడిగా అటూఇటూ తిరుగుతూ—అది ఇంతసేపూ గదిలో

క త్తిపీటనే వెదుకుతున్నట్టు.అమ్మ నవ్వింది. కాంతమ్మ ఇంత సేపూ ఏక త్తిపీటను గదిలో వెదుకుతున్నదీ అమ్మకు తెలియక పోలేదు.

*     *     *     *     *

ఎండ విరగకాస్తోంది. అందరూ వసారాలో నిద్రపోతు న్నారు. బుల్లోడు, పాప, వెంకమ్మగారి కొట్టంలో పిల్లెమ్మ లాట లాడుకొంటున్నారు. బావ గదిలో పడుకొన్నాడు. కాంతమ్మ గదివాకిట్లో అటొక కాలూ, ఇటుక కాలూ వేసి నిల బడి బావతో మాట్లాడుతున్నది.

"ఇట్లా రా. మాట" అన్నాడు బావ.

"ఇక్కడే వుంటాను చెప్పండి" అన్నది కాంతమ్మ.

"దగ్గిరికి రావాలి"

"నాకేం చెవుడులేదు లెండి, వినిపిస్తుంది" అన్నది నవ్వి.

"మంచిమాట" అన్నాడు బావ.

"నాకేం వొద్దు లెండి, మీరే దాచుకోండి ఆమాటను" అన్నది కాంతమ్మ. ఆ మంచిమాట ఏమిటో దానికి తెలుసు.

"కాదు. వెంటనే పోదువుగాని."

"వొద్దు; ఎవరన్నా వొస్తారు. ఇక్కడవుంటే వొచ్చే వాళ్ళు కనిపిస్తారు. లోపలికొస్తే తలుపు అడ్డంవొస్తుంది."

"మధ్యాహ్నంపూట . మనింటి కెవరొస్తార్లేవోయ్."

అన్నాడు బావ. బావ లేచాడు. నడిమింటి తలుపు దగ్గిరిగా వేశాడు. కాంతమ్మను పట్టుకొని గదిలోకొచ్చాడు.

"అబ్బ! మరీ ప్రాణాలు తీస్తున్నారు, పగలూ లేదు. రాత్రీలేదు" అన్నది కాంతమ్మ అక్కణ్నించి లేవకుండానే.

అంత ఇష్టంలేనిదయితే అమ్మమంచందగ్గిర పడుకోకపోయిందా మరి?

బావ మంచంమీద పడుకొన్నాడు. కాంత కాళ్ళురెండూ మంచంమీదనేపెట్టి కూచునివుంది. కాంతమ్మ మెళ్ళో చంద్ర హారాన్ని బావ పరీక్షిస్తున్నాడు. బావగుండీల్ని కాంతమ్మ తిప్పుతున్నది.

గడియారం మూడు కొట్టిందాకా వాళ్ళిద్దరూ అట్లాగే మాట్లాడుతూ కూచున్నారు. దఢాలున తలుపు తీసుకొని పాప లోపలికొచ్చింది. అట్లా జరుగుతుందని వాళ్ళిద్దరూ అనుకోలేదు.

"ఏంకొంప నా బొందకొంప. పెట్టినయ్ పెట్టినచోట వుండిచావవు. నిన్న మధ్యాహ్నం ఇక్కడ సూదిపెట్టాను. ఇవ్వాళచూస్తే లేదు. ఏమే! పాపా?! నువ్వుతీశావా?" అన్నది కాంతమ్మ. సూదికోసం గది నాలుగుమూలలూ వెదుకుతూ. బావ ఎప్పుడో ముసుగుపెట్టుకొని పడుకొన్నవాడల్లా బద్ధకంగా నిద్రలేచినట్లు కళ్ళు నులుముకొని లేచి "ఏమిటి?" అన్నాడు పాపతో.

"సూది కనపళ్ళేదంట బావా! నేను తీశానని అక్కయ్య నన్ను తిడుతోంది బావా!" అని పాప అక్కయ్యమీద ఫిర్యాదుచేసింది. బావ కాంతమ్మనుచూసి నవ్వాడు. కాంతమ్మ పెదిమబిగపట్టి, మొఖంలోకి కోపంరప్పించి, కళ్ళతో పాప వున్నదని సౌంజ్ఞచేసి వెళ్ళింది...

...అమ్మ టీ కాచింది. మధ్యాహ్నంపూట బావ టీ తాగుతాడు.

"ఆ అబ్బాయి లేచాడేమో, టీ యిచ్చి రామ్మా!" అన్నది అమ్మ కాంతమ్మను.

"బావ ఇందాక నే లేచాడమ్మా" అన్నది పాప తల్లితో.

"మరీ కాలుతున్నది. రెండో గ్లాసుగూడా తీసుకెళ్ళవే, కాంతం" అన్నది అమ్మ.

"నేను పోను, పాపాంని పంపించు" అన్నది కాంతం.

"ఏం? ఏమొచ్చిందే?"

"ఏమోనమ్మా! ఆయనదగ్గిరికి పోవటానికి సిగ్గుగా వుంటుంది చచ్చి"

"నాడే! ఇట్లాఅయితే. సిగ్గటమ్మా సిగ్గు! ఏం సిగ్గు? మొగుడుకు టీ యిచ్చి రావటానికిగూడా సిగ్గేనా? వెళ్ళమ్మా. మాఅమ్మవుగదూ. ఇదిగో! ఆయిత్తడి గ్లాసుగూడా తీసుకెళ్లు."

అమ్మ ఇంకా ఏమిటో అంటున్నది. కాంతమ్మ వినిపించుకోకుండానే దొడ్లో కెళ్ళిపోయింది.

"ఒట్టి పిచ్చితల్లి. ఈ కాలపు బుద్ధులూ పోకళ్ళూ ఎరుగదు. ఎట్లా కాపరంచేస్తుందో ఏమో!" అనుకొన్నది అమ్మ టీ గ్లాసుతీసుకొని బావ గదిలోకి పోతూ.

* * * * *

ఎనిమిదిగంటలకల్లా బావ షికారునుండి తిరిగివొచ్చాడు. రాగానే అమ్మ స్నానానికి లేపింది. బావ తుండుచుట్టుకొని దొడ్లో కాకరపాదు ధగ్గిర నిలబడివున్నాడు. అమ్మ నీళ్ళుతోడి వెళ్ళింది. కాంతమ్మ సబ్బు బావకిచ్చింది. పోతూ, పోతూ కాసిని చన్నీళ్ళు బావమీద చల్లి నవ్వుకొంటూ వెళ్ళింది.

"వొచ్చావేం? కాస్త నీవు తోమకపొయ్యావు కే!" అన్నది అమ్మ కాంతమ్మను

"నీవు తోమాలా? గుంజ తోమాలా? తోముకో లేదేమిటి?" అన్నది కాంతమ్మ చీకట్లో బావవేపు చూస్తో.

"మరీ యింత చింతకిట్టెవయిపోతున్నావేం? ఇక ముందు కాపరం ఎట్లా మండబెడతావమ్మా! అందులో అత్తాఆడబిడ్డల అదుపుగూడా లేకుండా, మీఆయన ఏకంగా బస్తీకి పట్టుకెడతా నంటున్నాడు. ఆ యబ్బాయి కూడుగుడ్డలకు కట్టేటట్టున్నావు చూస్తుంటే!"

"అందరూ చేసినట్లే నేనూ చేస్తా. నా వొక్కదాని మొఖాన్నే పొద్దుపొడవలేదుగా" అన్నది కాంతమ్మ కొంచెం కష్టంగా. అమ్మ అన్నమాటకు కాంతమ్మ నొచ్చుకొంది.

అందరూ అన్నాలు తిన్నారు బుల్లోడు, పాప నిద్ర గూడాపొయ్యారు. కాంతమ్మ పెందరాడే సబ్బుపెట్టి స్నానం చేసింది. తెల్లటి యిస్త్రీచీరె కట్టింది. వాయిల్ జాకెట్టు తొడుక్కుంది. చక్కగా పూలు పెట్టుకొంది. సన్నగా కాటుకగూడా పెట్టుకొంది.

గదిలో పడుకొని ఏమిటో చదువుకొంటున్నాడు బావ. ఆయన పిల్లలతోపాటే భోంచేశాడు. తరవాత కాంతమ్మ తిన్నది. అమ్మ తింటున్నంతసేపూ కాంతమ్మ అమ్మపక్కనే కూచున్నది.

అమ్మ అన్నం తిన్నది. వంటిల్లంతా సర్దింది. దొడ్డితలుపు గడియవేసింది. బుడ్డితీసుకొని నడిమింటి గూట్లో పెట్టింది. కాంతమ్మ అమ్మ వెంటనే తిరుగుతున్నది. అమ్మ పైటికిపోతూ

తలుపులు లాగి, బైట వేపు గొళ్ళెం పెట్టింది. కాంతమ్మ లోపల వేపు గడియవేసి గూట్లో దీపంమలిపి గదిలో కొచ్చింది. బావ చదువుతున్నాడు.

"అబ్బా, ఎప్పుడూ వొకటే చదువు. కళ్ళు నొప్పులు పుట్టవటండీ!" అన్నది బావను వెనక్కు జరిపి మంచంమీదకూచుని

బావ పలక్కుండా చదువుకొంటున్నాడు. "అయ్యో! తమలపాకులు వేసుకోలేదేమండీ! మీకోసమనే అక్కడ పెట్టాను. నానోరు చూడండి సింధూరంమల్లే పండింది" అంటూ కాంతమ్మ తనముఖాన్ని బావముఖం దగ్గిరికి తెచ్చింది. బావ పుస్తకాన్ని పారేశాడు. కాంతమ్మ ముఖలావణ్యం అతని తల తిప్పింది.

"ఏదీ నన్ను చూడనివ్వు" అంటూ రెండు చేతుల తోనూ, దానిముఖాన్ని రెండు వేపులా పట్టుకొని ముందుకు లాక్కున్నాడు.

"అబ్బ ... వుండండి. . .మిమ్మల్నే ...వొదలండి" అన్నది. కాంతమ్మ, కేవలం బావను రెచ్చగొట్టే సదభిప్రాయంతో.

"బాగా పండింది" అన్నాడు బావ, కాంతమ్మ చెక్కిలి గట్టిగా ముద్దుపెట్టుకొని. కాంతమ్మ రెండో చెక్కిలి అందించింది" అట్లా చెయ్యటానికి ఈషణ్మాత్రమైనా కాంతమ్మ సిగ్గుపడ లేదు.

# అంతరార్థం

అతన్ని చూడంగానే మామగారు మొఖం తిప్పుకొన్నాడు. అత్త చెంబుతో నీళ్ళిచ్చి, మాటా పలుకూ లేకుండా లోపలి కెళ్ళిపోయింది. అతన్ని పలకరించినవాళ్ళుగానీ, కనీసం కూచోమన్నవాళ్ళుగానీ ఎవరూ లేరు.

దాదాపు పావుగంటసేపు అతను అల్లాగే స్తంభానికి ఆనుకుని నిలబడి, కాళ్ళుతీపులు పుట్టడంచేత, నెరాబాలోవున్న మంచాన్ని రేకులకిందికి స్వయంగా లాక్కొని కూర్చున్నాడు. అతని బావమరదులుగానీ, వదినా మరదళ్ళుగానీ, అతని వేపు చూడనన్నా లేదు. చూసినా, ఒక మనిషి—అందులో అల్లుడు—వచ్చినట్లుగా వాళ్ళు కించిత్ మాత్రమైనా ఫీల్ అయినట్లు లేదు.

నాగేంద్రానికి ఉక్రోషం వొచ్చింది. చమటపోసింది. ఉద్రేకంవల్ల వొంటిమీది వెంట్రుకలు నిక్కబొడిచాయి. పిడికిలి బిగించి, సాచి, రెండుతీతలు మామగారిని తీద్దామనుకొన్నాడు. అత నంత సమర్థుడు గూడాను. మామగారు వృద్ధాప్య ప్రాంగణంలో అడుగుపెట్టాడు. కనుక ఎదిరించి తనను తిరిగి కొడతాడనే భయం అనవసరం. అత్తా వదినెల సంగతా? ... వాళ్ళు ఆడవాళ్ళు. బావమరదులు చిన్నపిల్లలు.

ఏమయ్యేదీ చెప్పటం కష్టం! అత్త పలకరించింది. ఎంత చెడ్డా అల్లుడు అల్లుడే! ఎంత పుచ్చిన మిరియాలైనా జొన్నల పాటి విలువచెయ్యకపోవు.

నాగేంద్రం ప్రయత్నపూర్వకంగా తన కోపాన్ని, ఆవేశాన్ని అణుచుకొన్నాడు. తను వచ్చినపని వేరు. అది నరవేరటానికి ఆవేశాలు పనికిరావు. ఒకప్పుడు అవే వుపయోగించవలసివచ్చేవేమో! ప్రస్తుతం తన స్థితిగతులు కొంచెం వక్రించినై. గ్రహాలు నీచకోణం వేపు తిరిగివున్నాయి. బెదరించీ, భుజబలం చూపీ నెట్టుకెళ్ళే రోజులు చాలకాలం కిందనే మాయమయిపోయినై. ప్రస్తుతం తనే లొంగిరావాలి. లొంగి ఆ "కాస్తా" ఇటుతిరిగిన తరువాత-వెధవ వీడి లెఖ్ఖేమిటి? వీడితల్లో జేజెమ్మలు తిరిగివస్తారు?

అందుకనే నాగేంద్రం ఏమీ మారుపలకలేదు. తనపట్ల వాళ్ళెంత నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తున్నా, తనను క్రిమిని చూస్తున్నట్లు చూసినప్పటికీ, అతనేమీ బాధపడలేదు.

చాలా పొద్దుబోయింది. పిల్లలంతా భోజనంచేసి పడుకొన్నారు. నాగేంద్రం స్నానంచేసి, రెండు మెతుకులు కొరికి సిగరెట్టు వెలిగించాడు. అతని మంచం భోషాణానికి పక్కగా వసారాలో వేసింది అత్త. నాగేంద్రం క్షణకాలం నిశ్చలమైపోయినాడు. ప్రథమంగా తను వూహించిందానికీ ఇక్కడ జరుగుతూన్నదానికీ ఎక్కడా సంబంధంలేదు.

"ఇక్కడ వేశారేం మంచం?" అన్నాడు నాగేంద్రం అత్తతో.

"ఉక్కగా వుంటుందంటావా? పోనీ పందిరికింద వేసుకో...ఏం? వెయ్యమంటావా పందిరికింద?" అన్నది అత్త.

నాగేంద్రం పలికలేదు. చుట్టూ వొకసారి చూశాడు, తనభార్య తండ్రిమంచంప్రక్కనే పక్క వేసుకొని పడుకుంది.

మామగారు చుట్టకాలుస్తున్నాడు. అతనికి తలతీసేసినంత అవమానంగా తోచింది. వెంటనే ఆ అర్ధరాత్రే వెళ్ళిపోదామనిపించింది. రెండు అడుగులు వేశాడు.

"ఇంకా అట్లాగేచూస్తూ నుంచున్నావేమే? అవసరమైతే అతగాడే మార్చుకుంటాడు. నువ్వు పెట్టెలకు తాళాలు వేసి జాగ్రత్తగా బొడ్లోవుంచుకో. కాలంబాగుండలేదు. ఎవర్నీ నమ్మేరోజులు కావివి." అన్నాడు మామ.

నాగేంద్రం ప్రాణం చివుక్కుమంది. తనను పచ్చిదొంగగా తనమామ భావిస్తున్నాడు. అత్తగారిచేత ముఖ్యంగా భార్యసమక్షాన ఇటువంటి అవమానం జరపబడటంకంటే, తన పురుషత్వాన్ని దెబ్బగొట్టటం ఏముంటుంది?

నాగేంద్రం మంచాన్ని పందిరికిందకు లాక్కోబోతున్నాడు. గంగన్న—మామగారి జీతగాడు—"ఎందుకులేండి మీరు లాక్కోవటం, నేతెత్తాను తాలండి" అని వాడే పందిరికిందకు లాగి. పక్కనే, తన చాపా, గోనెపట్టాలు పరుచుకొన్నాడు.

ఆరాత్రి నాగేంద్రానికి నిద్రపట్టలేదు. రకరకాల ఆలోచనలుబుర్రను జలగల్లాపట్టి పీకుతున్నాయి. రేపు కథను ఎట్లా సానుకూలపరుచుకోవాలి? వాళ్ళందరూ పలకకపోవటానికి కారణమేమిటి? శ్రీదేవి తన బండారం కాస్తా ఇక్కడ బైటపడేసిందా? తను ఇక్కడకు వొచ్చినప్పటికీ, గదిలో మంచం వెయ్యక ముష్టివెధవను పడుకోబెట్టినట్లు వీధిలోకి తొయ్యటమేమిటి? ఒకవేళ శ్రీదేవి కుర్రతనంవల్ల మోయించినా,

తల్లయినా సరిదిద్దవచ్చుగదా? ఆమెగారు, మామగూడా నిర్లిప్తంగా వూరుకొన్నారేం?

ఈ విధంగా ఆ రాత్రల్లా నాగేంద్రం ఆలోచిస్తూనే వున్నాడు. వాటికి సరైనసమాధానం తెల్లవారి మామగారు ఇచ్చాడు.

"నాయనా అయిందేదో అయింది. ఇక నీదారి నువ్వు చూచుకోవొచ్చు" అన్నాడు మామగారు చివరికి తేల్చి.

"అంటే ఏమిటో అర్థంగాలేదు" అన్నాడు నాగేంద్రం.

"అర్థంగావటాని కిందులో ఏముంది? మీకూ మాకూ యింతటితో సంబంధం రద్దుచేసుకోమంటున్నాను."

"ఎందుకూ?" అన్నాడు నాగేంద్రం పెద్దగా గొంతు పెంచి.

"అంతచేటు పగలదీసుకో నక్కర్లేదు." మెల్లిగా మాట్లాడు. నీకు భార్య ఎక్కువయినంత మా తాన నాకు కూతురు ఎక్కువగాదు. నీబోటి అంట్లవెధవ దగ్గిరికి పంపించి దాని వుసురు నే నెక్కడ పోసుకో నేది? నా నలుగురు మొగ పిల్లలతో బాటు అదీ వొక పిల్లవాడనుకొంటాను. ఇక మీరు మర్యాదగా దయచెయ్యొచ్చు"

చుట్టూతా జనం కూడసాగారు. అంతమంది ఎదుటా మామచేత ఆమాటలు పడిన తరువాత, నాగేంద్రం నిర్వీర్యుడయిపోయినాడు. కాస్త సంబాళించుకొని తిరిగి పుంజుకొన్నాడు.

"మీతోటి నాకు సంబంధంలేదు. మీరెవరో, నేనెవరో. నేను నీకోసం రాలేదు. నాభార్య కోసం వొచ్చాను"

"ఇంకేం! అది వాస్తానంటే తీసుకెళ్ళు, నా అభ్యంతర మేమీ లేదు" అన్నాడు మామగారు.

నాగేంద్రం భార్యను పిలిచాడు. తలుపుచాటున వుండి ఈ రభసను చూస్తున్న శ్రీదేవి, మెల్లగా ముందుకొచ్చి, తల వొంచుకొని నిలబడింది.

"మీ నాయన అంటున్న మాటలు నువ్వూ విన్నావు. మరి నీ అభిప్రాయమేమిటి" అన్నాడు నాగేంద్రం.

"నేను రాను"

"ఎందుకని?"

తనెందుకురాదో రాలేదో, శ్రీదేవి వివరించింది.

"భార్యా భర్తలన్న తరువాత కొట్టుకోకుండా తిట్టుకోకుండా వుంటారా? రెండురోజులు కీచులాడుకొని వాళ్ళే బాగుంటారు. పంపించండి" అన్నారు అక్కడ చేరినవాళ్ళు.

మామగారు వినలేదు.

"నేను పంపను" అన్నాడు ఖచ్చితంగా.

"అయితే నేను యింకోదోవ చూచుకోవొచ్చు నంటారా! తరువాత మళ్ళీ పేచీపెడితే బావుండదు ఇప్పుడే మీరే తేల్చండి. ఎందుకూ మునుగులో గుద్దులాట?" అన్నాడు నాగేంద్రం.

"ఓ నిరభ్యంతరంగా చూచుకోవచ్చు. నీ బెదిరింపులకు యిక్కడ బెదిరేవాళ్ళెవరూలేరు. తాటాకులచప్పుళ్ళకా కుందేళ్ళు పరుగెత్తటం? ...ఊఁ, బయలుదేరు. ఎండెక్కుతోంది" అన్నాడు మామగారు, హెచ్చరిస్తున్నట్లుగా.

నాగేంద్రం వొక్కసారి భార్య ముఖంవేపు చూశాడు. అందులో అతనికి కావలసిన భావాలేమీ దొరకలేదు. ఒక్క నిట్టూర్పు దీర్ఘంగా విడిచి, చిన్నదగ్గు దగ్గి బైటికొచ్చేశాడు.

రెండుమూడు నెలలు గడిచినాయి. నాగేంద్రం ఇతరత్రా ప్రయత్నాలేమీ చేయలేదు. చేయటం అనవసరమని గూడా అతనికి తెలుసు. అమ్మా, నాన్నా బ్రతికివున్నారు. గనక, ఆరోజుల్లో ఏవో నాలుగు బులిబుచ్చి కబుర్లు చెప్పి, బ్రహ్మిని తిమ్మిని చేసీ, తిమ్మిని బ్రహ్మిని చేసీ కార్యసాధన విజయవంతం చేశారు. ఈ రోజున తనగతేమిటి? ఏమిచూసి తనకు పిల్లనిస్తారు యిచ్చేవాళ్ళు?

రెండో వివాహవిషయం సంపూర్తిగా నిరాశచేసుకొన్నాడు నాగేంద్రం. హోటల్లో తినటం, ఆఫీసులో పని చెయ్యటం, గదిలో నిద్రపోవటం. ఇట్లాగే కాలందొర్లిపోతోంది.

ఒకరోజు రాత్రి, అతను చాలాసేపు చదువుకొని, నిద్రపోవటం కోసం తలుపు వేసుకొందామని లేచేసరికి, తలుపు పక్కగా ఎవరో ఆడమనిషి, నిండా ముసుగు కప్పుకొని నిలవబడివుంది.

మొదట్లో నాగేంద్రం భయపడ్డాడు. తర్వాత ధైర్యాన్ని కూడతీసుకొని ఆమెను ప్రశ్నించాడు.

"ఎవరు నీవు?"

ఆమె పలకలేదు.

"పోలీసులను పిలవమంటావా?" అన్నాడు నాగేంద్రం లోపలినుంచివొస్తున్న వణుకుని వీలయినంతవరకు తొక్కిపడుతో నాగేంద్రానికి అపరిమితమయిన భయం వేసింది.

"పిలవండి" అన్నది ముసుగులో మనిషి. ఆకంఠస్వరం తనకు పరిచయమైనదే.

ఎవరు?

ఎవరు??

ఎవరీ మనిషి???

గబగబా లాంతరు తెచ్చి, ముసుగుతొలగించి, చూశాడు. శ్రీదేవి! కళ్ళవెంట నీళ్ళుకారుతున్నాయి. ముఖం వాలిపోయింది. మనిషి చికాకుగావుంది. కాళ్ళనిండా దుమ్ము. చంకలో చిన్న గుడ్డమూట.

ఆమెను చూడగానే నాగేంద్రానికి కోపంవచ్చింది. శరీరం ఆవేశంతో వూగింది. పళ్ళుకొరికాడు. ఇంతక్రితం అతను అనేకసార్లు ఈ సంఘటన యిట్లా జరిగితే బాగుండేదని అనుకొన్నాడు. వాళ్ళకు—ఆ ముసలివెధవలకు బుద్ధిలేక పోవచ్చు. కనీసం శ్రీదేవి అయినాఎందుకు ఆలోచించగూడదు? నాశనమైపోయేది 'తను'గానీ తనఅమ్మా నాన్నా కాదుగా! ఈ విచక్షణ శ్రీదేవిలో ఎందుకు లోపించింది? ఆమె తనంతట తాను వొస్తే ఎంతబాగుండును! చివరికి ఏమనిషిచేతనన్నా కబురుచేయిస్తే తనువెళ్ళి నిక్షేపంగా తెచ్చుకొంటాడుగదా!

పాపం! నాగేంద్రం పొరబాటుపడ్డాడు, శ్రీదేవి, తనతో కాపరం చెయ్యాలనే అభిప్రాయమే వుంటే; మొన్న తనువెళ్ళినప్పుడే రావొచ్చుగదా! అసల్కు రావటమనేది శ్రీదేవికి బొత్తిగా యిష్టంలేదు. రాదలుచుకుంటే, తల్లీదండ్రీ అడ్డు రానేరారు. మామగారుతన దేమీలేదనీ; అమ్మాడు వొస్తానంటే

తనకు అభ్యంతరం వుండబోదనీ కుండబద్దలుగొట్టినట్టు చెప్పనే చెప్పాడు. ఇదంతా శ్రీదేవి పితలాటకమే!

నాగేంద్రం భార్యాకోసం విచారించినమాట నిజం! ఆ పిల్ల ఏవో కారణాలవల్ల, ఎట్లాగో, తన దగ్గిరికి వచ్చినా బాగుండునని అనుకోవటమూ అబద్ధంకాదు. అట్లా వొకవేళ జరిగేపక్షంలో భార్యను కళ్ళకుఅద్దుకొని స్వీకరించుదామని గూడా అతను అనుకొన్నాడు.

అయితే జరిగింది వేరు. ఎందుకని అట్లా అనిపించిందో మనకు తెలీదు గానీ, ఆమెను చూడగానే మహా కోపం వొచ్చింది.

"ఎందుకొచ్చావ్? ఎవరున్నారనివొచ్చావు!" అన్నాడు నాగేంద్రం పెద్దగా..

శ్రీదేవి మాట్లాడలేదు. మొదలకుండా చంకలో వున్న మూటను పక్కనే పెట్టుకొని, తలుపువారగా కూచుంది. శ్రీదేవి చేసిన ఈ పనితో నాగేంద్రానికి ఆమెమీద అధికారం ఏర్పడినట్లయింది.

"దయచేసి లేవమని విజ్ఞప్తిచేస్తున్నాను. లేకపోతే బలవంతాన బయిటికి గెంటవలసివొస్తుంది. నాబోటిత్యాష్ట్రిని చేత తమలాంటి ఉన్నతకుటుంబీకులు, అంతపని చేయించుకోరని భావిస్తున్నాను,"

శ్రీదేవి వొకసారి భర్తముఖంలోకి చూసి తలొంచుకొంది.

"అన్నంతపనీ చేసిందాకా తమరు కదలదలుచుకోలేదా ఏమిటి?" అన్నాడు నాగేంద్రం.

"నన్నెందుకింత అవమానపరుస్తారు?" అన్నది శ్రీదేవి.

'ఇందులో తమరికి నేను చేసిన అవమాన మేమిటో బోధపడకుండా వుంది. అయినా యిటువంటి అనుమానాలు నాచేత పొందకుండా—తమరు త్వరగా"

"ఇదంతా గౌరవించటమా? చేసుకొన్న భార్యను 'తమరు'—'మీరు'—'ఏమండీ!' అనటం మరి గౌరవించటమా?" అన్నది శ్రీదేవి.

నాగేంద్రం వులిక్కిపడి, రెండడుగులు వెనక్కి వేసి, చిన్నగానవ్వి, ఆశ్చర్యపడుతున్న వాడి కిమల్లే మొఖం పెట్టాడు.

"ఇదేమిటి - నీనోటినుండి—క్షమించాలి—తమనోటి నుండి చాలా చిత్రమైన విషయాలు వింటున్నాను. నేనెవరికి భర్తనూ? చాలా వింతగా చెబుతున్నారే!" అన్నాడు కసిగా.

"మీరన్నంత మాత్రాన, నేను మీ భార్యనుకాకుండా పోతానా? మీరు 'మావారు' కాకుండా పోతారా?" అన్నది శ్రీదేవి తల ఎత్తకుండానే.

నాగేంద్రంపెదిమలమీద చిన్ననవ్వు పాకి, వెంటనే మాయమయింది. ఏదో విజయం సాధించినట్లు, తలవెనక్కూ ముందుకూ ఆడించాడు.

"నువ్వు నాభార్యవవుతావో కాదో నాకు తెలీదుగానీ, నేనుమాత్రం నీభర్తను కాను. నాభార్య చచ్చింది. ప్రస్తుతం నేను వొంటరిగాణ్ని. అంతగా నాభార్యను చూడాలనే కోర్కె మీకుంటే, రెండువారాల తరవాత రండి. ఈలోపుగా వెంకట సుబ్బయ్యగారి కూతురుతో నా పెళ్ళి జరిగిపోతుంది. సరేనా! ఇక వెళ్ళొచ్చు."

శ్రీదేవి ఈ మాటతో వులిక్కిపడింది. తలపైకెత్తి దిగులుగా నాగేంద్రంముఖంలోకి చూసింది.

"క్షమించండి! పొరపాటుచేశాను, నా జీవితాన్ని మట్టిపాలు చేయకండి. తల్లినీ, తండ్రినీ, అన్నదమ్ముల్నీ, అప్పచెల్లెళ్ళనూ వొదిలి సర్వమూ మీరే ననుకొని, మీదగ్గిరకొచ్చాను మీరే నాతప్పుల్ని మన్నించకపోతే, నాకు వేరే దిక్కేముంది? ఏంగాను?" అన్నది శ్రీదేవి అతనికాళ్ళ దగ్గిర కూచుని, చేతులతో రెండుకాళ్ళూ గట్టిగా పట్టుకొని.

నాగేంద్రానికి తెరిపివొచ్చినట్లయింది. తను ఇంతసేపూ ఆమెనుండి, ఏమికోరుతున్నాడో 'అది' లభించినట్లుగా తోచింది.

"ఈ జ్ఞానం 'ఆనాడు' వుండవలసింది. ఇప్పుడు పరిస్థితులు నా చేయిదాటిపోయినవి. నేను చేయగలిగిందేమీ లేదు. వెంకటసుబ్బయ్యగారి కూతుర్ని చేసుకోబోతున్నాను. లగ్నాలు పెట్టుకోవటంగూడా ఎప్పుడో జరిగిపోయింది. ఇంకో రెండువారాలలో పెళ్ళిగూడా అవుతుంది. ఇక నువ్వు నిరభ్యంతరంగా మీయింటికి వెళ్ళిపోవొచ్చు!"

"నేనా? ఇక్కడనుండి కదలను."

"కదలకపోతే, నేను కదిపిస్తాను" అన్నాడు ఆమెమీదికి వొంగి.

"మీరు నన్ను కొట్టండి, తిట్టండి, తన్నండి, చీల్చండి. ఆ హక్కు నామీద మీకున్నది. ఏనాడు నామెడకు మూడు ముళ్ళూ వేశారో, ఆనాడే నేను మీసొత్తునయిపోయినాను.

నన్ను మీరేమిచేసినా నేను వెళ్ళను.'' అన్నది శ్రీదేవి అతని కాళ్ళను'' గట్టిగా కావిలించుకొని.

"ఇప్పుడేమీ లాభంలేదు. కనీసం పదిరోజుల కిందట నువ్వు వొచ్చినట్లయితే, ఎట్లావుండేదో నేను చెప్పలేను. వెంకట సుబ్బయ్యగారికి మాట యిచ్చాను.'' అన్నాడు నాగేంద్రం.

"నా రాత ఎట్లావుంటే ఆవిధంగా జరుగుతుంది. కాని వ్వండి. మీ సుఖానికి నేను అడ్డంరాను. మీరు రెండో వివాహం చేసుకోండి. మీ పాదాలదగ్గిర బెత్తెడు స్థలం నాకు ప్రసాదించండి. మీసేవ చేసుకొంటూ వుంటాను.'' అన్నది శ్రీదేవి అతని కాళ్ళకు ముఖాన్ని గట్టిగా హత్తి.

"నీ పీడ వదిలిపోయింది గదా అని సంతోషించాను. మళ్ళీ శనిగ్రహమల్లే నన్ను తగులుకొన్నావు. ఛీ". అంటూ నాగేంద్రం కాళ్ళు విదిలించుకొని దూరంగా వెళ్ళి నిలబడ్డాడు.

శ్రీదేవి నాలుగునిమిషాలు అట్లాగేచూచాని, తరువాత, తలుపు పక్కనేవున్న మూట తెచ్చి, గదిలో వొకమూలగా పెట్టింది. తలుపులువేసి గడియపెట్టింది.

"మీరు కొంచెం పక్కకు తప్పుకోండి. ఇల్లంతా శుభ్రంగా వూడుస్తాను. మరీ నానాగిజాటుగా వుంది" అన్నది శ్రీదేవి.

"అక్కర్లేదు. నేను వూడ్చుకొంటాను" అన్నాడు నాగేంద్రం మూలగావున్న చీపురుకట్టవేపు పోతూ.

శ్రీదేవి రెండడుగుల్లో చీపురుదగ్గిరకెళ్ళి గభాలున చేతిలోకి తీసుకొంది.

"అక్కర్లేను. విడువ్'' అన్నాడు.

"విడవను. మీరు చీపురు పట్టుకోటం నేను కళ్ళారా చూడలేను."

"అది తరవాత సంగతి. ముందు చీపురు వదలాలి."

"ఏం? నేనేం పాపంచేశాను? నా యిల్లు నేను శుభ్రం చేసుకోగూడదా?" అన్నది శ్రీదేవి ఏడుపుముఖంపెట్టి.

"ఇది నీయిల్లు గాదు."

"పోనీయండి. ఇంతక్రితం నన్ను "దాసి"గా స్వీకరిస్తామన్నారు. కనీసం ఆ హోదాతోనన్నా నన్ను వూడ్వనివ్వండి."

నాగేంద్రం ఇంకోమాట లేకుండా, ఒక్క విదిలింపు విదిలించుకొని బైటికివొచ్చి, వాకిట్లో నిలబడ్డాడు.

పదినిమిషాలకల్లా శ్రీదేవి యిల్లు శుభ్రంగా వూడ్చింది. చిలుముబట్టిన యిత్తడిగ్లాసును ఇసకబెట్టి పచ్చగా తోమింది. నాగేంద్రానికి చక్కగా పక్క అమర్చింది. నాగేంద్రం లోపలికొచ్చి, ఇల్లు నాలుగుమూలలూ చూసి, మంచంమీద పడుకొన్నాడు కళ్ళుమూసుకొని.

అతనికి నిద్రపట్టటల్లేదు. కొంచెంసేపటికి శ్రీదేవి గొంతు వినిపించింది.

"ఛీ! ముదనష్టపన్నం, పాచిపోయింది. తింటానికేం పనికొస్తుందీ?"

నాగేంద్రం చప్పునలేచి, చొక్కాతొడుక్కొని బైటికి వెళ్ళాడు. ఈలోపుగా శ్రీదేవి, అలమరాతీసి, నూనె రాసుకొని, తల దువ్వుకొంది. సబ్బుపెట్టి ముఖం కడుక్కొంది. ఈ కార్యక్రమం ముగుస్తుండగానే నాగేంద్రం వొచ్చాడు. ఒచ్చీరావటంతోనే చేతిలోవున్న రెండు పొట్లాలనూ శ్రీదేవిమీదికి విసిరి,

మాటాపలుకూ లేకుండా, మంచంమీద కెళ్ళి ముసుగుపెట్టు కొన్నాడు.

శ్రీదేవి ఆ మిఠాయి తిన్నది. కూజాలో నీళ్లు తాగింది. దీపం చిన్నదిగా తగ్గించి, నాగేంద్రంమంచంపక్కనే చాప వేసుకొని పడుకొంది.

...ఒక రాత్రివేళ నాగేంద్రానికి, ఏదో అలికిడి అయి నట్లు తోచి, కళ్ళు తెరిచాడు. శ్రీదేవి మంచంమీద కూచుని, అతని కాళ్ళు పిసుకుతున్నది! ఏదో అందామని నాగేంద్రం ప్రయిత్నంచేశాడుగానీ, లాభం లేకపోయింది. అతని గొంతుకు వుండలాంటిదేదో అడ్డుపడి, ఆ మాట పైకి రాలేకపోయింది. చిన్న దగ్గుదగ్గి మళ్ళీ ముసుగుపెట్టుకొన్నాడు.

అరగంట గడిచిన తరవాత, శ్రీదేవి మెల్లిగా, అతన్ని నెడుతూ "కొంచెం పక్కకి జరగండి. చాపమీద పడుకొంటే మరీ ఎముకలు వొత్తుకుపోతున్నాయి" అన్నది.

ఈ మాటలు నాగేంద్రానికి వినిపించినయ్యో, లేదో చెప్పటం చాలాకష్టం. అతనుమాత్రం గురక బెడుతూనే పక్కకు జరిగాడు. శ్రీదేవి శరీరం మిగిలినభాగాన్ని ఆక్రమించింది...ఒక రాత్రివేళ నాగేంద్రం పెదిమలు శ్రీదేవిని ముద్దు పెట్టుకొంటు న్నాయి. అతనిచేతులు ఆమె శరీరాన్ని దగ్గిరిగా పొదువుకొం టున్నాయి. ఆమెచేతులు అతని నడుమును చుట్టుకొని వున్నాయి. తనకు యిష్టంలేని ఆ పాపిష్టికార్యం చెయ్యటా నికి, అతని అంతరాత్మ, ఎంత ఘోషపెట్టిందో భగవంతుడికే తెలియాలి.

* * * * *

శ్రీదేవి అదృష్టవంతురాలు. నాగేంద్రం రొండో పెళ్ళి చేసుకోలేదు. ఏదో ఒకటి రెండురోజులు ముభావంగావుండటం తప్ప, తరవాత వాళ్ళిద్దరూ బాగా నేవున్నారు. శ్రీదేవి తల్లి దండ్రులు వొకసారి రహస్యంగా వొచ్చి, కూతుర్ని చూసి పొయ్యారని, కొంతమంది చాటుమాటుగా అనుకొనేమాటల్లో, ఎంతవరకు నిజం వున్నదో మనకు తెలీదు.

ఇన్నిటికీ అదృష్టజాతకుల్ని ఎవ్వరూ చెరపలేరు. శ్రీదేవి ఇక్కడకు వొచ్చిన అయిదోనెలకు ప్రసవించి, మొగ పిల్లవాణ్ని కన్నది. కానీ, శ్రీదేవి కనిన పిల్లవాడికీ, గంగన్నకూ ఆట్టే భేదంలేదని, కిట్టనివాళ్లు కొందరనవొచ్చు. ఆ మాటలు నిజంగూడానేమో! అయినా ఇవన్నీ మనకనవసరం. ఇటువంటి పాపపుమాటలు బొత్తిగా మనం అనుకోగూడదు.

# తారతమ్యం

మీనాక్షి భోగంది. ఇరవై సంవత్సరాల ఈడుకే కావలసినంతడబ్బు సంపాదించింది. తల్లి కాలంలోని పెంకుటిల్లు పడగొట్టి రెండంతస్తులమేడ వేయించింది. కొద్దిరోజుల్లోనే ఒక చిన్నకారు కొనేప్రయత్నంలో వుంది.

ఈసమయంలోనే మీనాక్షికి తన వృత్తిమీద అసహ్యం కలిగింది. ఈవిధంగా ఎంతకాలం జీవితాన్ని గడిపేటట్టు? డబ్బుకోసం ఎంతనటన చూపించాలి? రోజురోజుకూ మొగాళ్లు మారుతూనే వుంటారు. వొక్కో-రాత్రి ఆరుగురు మొగాళ్ళు మారిన సమయాలుగూడా లేకపోలేదు.

మీనాక్షికి ఇప్పుడు సంసారస్త్రీలమీదకు మనసు మళ్ళింది. వాళ్ళలాగా చక్క-గా (?) సంసారం చేస్తూ బిడ్డాపాపలతో కళకళ్ళాడాలని మీనాక్షి కోరిక! తను ఎంత "ప్రేమ" చూపినా అదంతా 'భోగంతళుకు' కిందనే జమకట్టబడుతోంది. తన జీవితానికి గమ్యస్థానమేమిటి? ఎంతదూరం తనీవిధంగా ప్రయాణించాలి? చివరికి మిగిలేదేమిటి?

మీనాక్షికి కొంత ఆలోచించిన తరవాత తన కోరిక అసంభవమైందిగా కనిపించింది. మీనాక్షి భోగంది. పధ్నాలుగోఏటనే వృత్తిలోకి దిగింది. ఈ ఆరుసంవత్సరాలకాలంలోనూ కొన్ని వందలమంది మీనాక్షిని అనుభవించారు. ఆ సంగతి ఎంతోమందికి తెలుసు. ఇప్పుడు మీనాక్షికి నిజంగా హృదయ పరివర్తనం కలిగి 'పెళ్ళి' చేసుకోవడానికి తయార

యుందే అనుకోండి, అయితే మీనాక్షిని చేసుకోవడానికివొచ్చే వాడెవడు? అంతసంస్కారం కలిగినవాడు దొరకడం చాలా కష్టం. కాకపోతే "వుంచు" కొంటారు. "పెళ్ళి" అనే పేరు మీదగాకుండా 'చేరదీస్తారు'.

మీనాక్షికి ఇవి నచ్చవు. వుంచుకొనేవాళ్ళు (పర్మనెంటుగా) చాలామంది వున్నారు. చేరదీసేవాళ్ళుగూడా చాలా మందే వున్నారుకానీ, మీనాక్షికి కావలసింది భర్త. రోజురోజుకూ ఈ సమస్యతో మీనాక్షి కొట్టాడుతూ వుంది.

## 2

అయితే మీనాక్షి కోరిక అసంభవమైందిగా కాలేదు. నాగేంద్రం మీనాక్షిని పెళ్ళిచేసుకోడానికి అంగీకరించాడు.

నాగేంద్రానికి పాతికసంవత్సరాల వయస్సు వుంటుంది. తల్లి చిన్నప్పుడే చచ్చింది. తండ్రి నాగేంద్రం ఇంటర్ చదువుతున్నప్పుడు చచ్చాడు. ఆస్తిపాస్తులేమీ లేవు. ఏదో దేశవాళీ కంపెనీలో నెలకు యాభయ్‌రూపాయలు తెచ్చుకొంటున్నాడు. నెలకు బొటాబొటీగా సరిపోతుంది. నాగేంద్రం భార్య నీళ్ళాడ లేక చచ్చిపోయి నాలుగుసంవత్సరాలైంది. ఇంతకాలం అతను పరాయి ఆడవాళ్ళను వాడుకొన్నాడు. అయిదునెలలు ఒక బ్రాహ్మణ విడోను 'వంట'కోసం అట్టేపెట్టుకొన్నాడు. ఈ లోపల శ్రీమతిగారికి గర్భం వొచ్చింది. ఆవిడ "జీతంచాలక" నాగేంద్రంనుండి వెళ్ళిపోయింది. మొత్తంమీద నాగేంద్రం ఇతరత్రా చాలా ఖర్చుపెడుతుంటాడు.

మీనాక్షి అతన్ని పెళ్ళిచేసుకోడానికి మనస్ఫూర్తిగా అంగీకరించింది. అప్పుడే ఆవిడదృష్టిలో పతివ్రతలు మెరవ

సాగారు. ముఖ్యంగా చింతామణి వగైరాలు. మీనాక్షి ఈ కోరిక తల్లికి సుతరాము నచ్చనేలేదు. ఆ కసినంతా నాగేంద్రం మీదికి సమీకరించింది. "నిన్ను పోలీసులకు పట్టిస్తా" నంది. "ఇంతకంటే మరేం గతిలేదూ!" అంది. కూతురుతో "ఒక్క పూచికపుల్లకూడా అంటుకోనివ్వన"ని నిష్కర్షగా చెప్పింది.

ఈ బెదరింపులకు ఏ ఒక్కరూ జంకలేదు. కట్టుగుడ్డలతో పది రూపాయలతో (ఇవి మాత్రం రాత్రి జట్కా ప్రియుడు ఇచ్చాడు) నాగేంద్రం వెంట బయలుదేరింది.

ఆనాటి రాత్రి హోటల్‌నించి కారేజి తెప్పించాడు నాగేంద్రం. మీనాక్షి ముందుగా నాగేంద్రానికి వొడ్డించింది.

"నీవూ కూచో మీనూ" అన్నాడు నాగేంద్రం.

ఆ స్వరంలో నిండారిన ప్రేమధ్వనులు వినిపించినయ్ మీనాక్షికి. మీనాక్షి గుండెలు గగుర్పొడిచినయ్. వొళ్ళు జలదరించింది.

"మీరు కానివ్వండి... ...తరవాత కూచుంటాను" అంది. అని తను పతిభక్తిని బాగా అలవాటు చేసుకొంటున్నా ననుకొంది. ఇదివరకు చాలామంది విటులు నాగేంద్రంలాగే అన్నారు. కానీ వాళ్ళమాటలకు నాగేంద్రం మాటలకు కొంత భేదాన్ని అస్పష్టంగా చూడకలిగింది మీనాక్షి. నాగేంద్రం భోంచేసి వొక్కపలుకు నములుతూ కుర్చీలో కూచున్నాడు. మీనాక్షికి రెండవఆకులో భోంచేయ బుద్ధిపుట్టలేదు. నాగేంద్రం కెలికికెలికి పోయిన ఎంగిలాకులోనే తనూ తింది. రోజూ తనుతినే అన్నానికీ దీనికీ చాలా భేద మున్నట్లుగా మీనాక్షికి తోచింది.

రెండో ఆట సినిమాకు పోయి వొచ్చేసరికి బాగా పొద్దు బోయింది. అందులో నాగేంద్రం పగలల్లా ఆఫీసులో (ఆఫీసు లోనని అతనే చెబుతుంటాడు. కాదనుకొన్నా ఈ రచయితకు అట్టే ఇబ్బందిలేదు. కానీ నెలకు 50 రూపాయలు మాత్రం తెస్తుంటాడు. అంతవరకు గ్యారంటీ) పనిచేయడంవల్ల అలిసి పొయ్యాడు. మీనాక్షి చప్పున గ్రహించింది. తెల్లారగట్లదాకా అతని కాళ్ళు పిసికింది.

# 3

నాగేంద్రం ఇంతవరకూ వున్నది వొక కొద్దిపాటిగదిలో. అందులో రెండే మంచాలు. వొక బీరువా, కొద్దిపాటి సామాను ఉంది. ఇదివరకు నాగేంద్రం నెలవారీగా హోటల్లో భోంచే స్తుండేవాడు. మీనాక్షి వొచ్చినప్పటినుండీ హోటలు కెళ్ళడం మానుకొన్నాడు. అయితే ఇద్దరుకూ సరిపడేలాగా క్యారియరు వొస్తుంటుంది. ఒకనాటిరాత్రి నాగేంద్రం తీరిగ్గా పడుకొని (ఆ సమయంలో మీనాక్షి ఇంకో మంచం మీద నిద్రపోతూ వుంది) తను నెలవొకటికి హోటలుకి ఎంత చెల్లిస్తున్నదీ లెక్క గట్టాడు. సొంతంగా వంటబెట్టే పక్షంలో హోటలుకు చెల్లించే డబ్బులో ఐదింట మూడువంతులకే అంతకంటే మంచిభోజనం దొరుకుతుందని అంచనావేశాడు. అయితే వంటకు ఈ యిల్లు చాలదు కాబట్టి వేరేయిల్లు తీసుకోవాలి, ఆ లెక్క ప్రకారం చూసినా వంటపెట్టడమే మంచిదిగా కనిపించింది నాగేంద్రానికి.

ఆ తెల్లవారే మీనాక్షితో ఈసంగతి చెప్పాడు.

"నాకు వండటం చాతగాదండీ" అంది మీనాక్షి. నిజంగా మీనాక్షికి వరిడడం చాతగాదు. చిన్నతనంలో తల్లి

వొండేది. మొన్నటిదాకా పనిమనిషి వొండేది. కాబట్టి వంట విషయం తెలుసుకోవలసిన అవసరం మీనాక్షికి ఇంతకితం కలగలేదు. కానీ ఇదివరకు తోవ వేరు, ఇప్పుడు తోవ వేరు. అందులో వారికి హోటలుకూడు సరిపడకనే ఈమాట అన్నారేమో? ఈ సందేహం మీనాక్షి మీద బాగా పనిజేసింది. వొండడానికి అంగీకరించింది. వొకటి రెండు రోజుల్లో అంతే అద్దెలో యింకో యిల్లు మాట్లాడాడు నాగేంద్రం. మీనాక్షి ఆ యిల్లు చూచి సంతోషించింది.

ఒకనాడు మీనాక్షి నాగేంద్రాన్ని కొద్దిగా చిల్లర డబ్బు లడిగింది.

"ఎందుకు"? అన్నాడు నాగేంద్రం.

"సబ్బు కొనుక్కోవాలి... అయిపోయి రెండురోజు లైంది" అంది మీనాక్షి. మీనాక్షి అతన్ని డబ్బులడగటం అదే తొలిసారి.

"సబ్బు లేకపోతే స్నానం చేయగూడదా ఏం!" అన్నాడు నాగేంద్రం మనం లక్షాధి కారులం గాము. కనీసం గొప్ప ఉద్యోగమన్నా లేదు. యాభయ్ రూపాయలు ఎన్నింటి కని వొస్తయ్?" అన్నాడు. అప్పటినుండి మీనాక్షి సబ్బుతో స్నానంచేసినపాపానపోలేదు.

# 4

తొలిరోజుల్లో నాగేంద్రం కొన్న నాలుగు చీరెలు చినిగిపోయినయ్. అప్పటికీ మీనాక్షి ఈ సంవత్సరమల్లా వాటిని పొందికగా వాడింది. సాధ్యమయ్యినంతవరకూ వాటిని సూదిదారంతో సంస్కరించింది. అప్పటికీ అలవిగాని స్థితిలోకి

దిగజారినయ్ ఆ చీరెలు. అసలు చినుగుముఖం పట్టినపుడే కొత్తచీరెలను గురించి వొకటి రెండుసార్లు నాగేంద్రాన్ని హెచ్చరించింది. అతగాడు ఈనెలనీ... ఆపై నెలనీ జరిపిళ్ళు బెడుతూ వొచ్చాడు, ఇక కొత్తచీరెలు కొనందే లాభంవుండ దని తేలిపోయిన రోజున మీనాక్షి నాగేంద్రానికి ఈ విష యమై గట్టిగా చెప్పింది.

"యాభయ్‌రూపాయల్లో ఎన్నని సర్దగలను! ఇంకా నయం, ఏపాతన్నా సొంతంగా నీకు వున్నయ్. ఇప్పుడు నేను వేసుకొంటున్న గుడ్డలు వొకానొక స్నేహితుడు ధర్మం చేశాడు...వొచ్చే నెలలో చూద్దాంలే" అన్నాడు నాగేంద్రం.

న్యాయంగా అయితే ఆ గుడ్డలు మరో వారంరోజుల యినా శరీరాన్ని కాపాడేస్థితిలోలేవు. ఆసంగతి నాగేంద్రానికి తెలుసు కానీ, ఏంచేస్తాడూ పాపం! యాభయ్‌రూపాయల గుమాస్తా పురుగాయె!!

చీరలనుగురించి యిబ్బందిపడడం మీనాక్షి జీవితంలో యిదే మొదలు. మీనాక్షికి చిన్నతనంలోనే పాతికజతలుండేవి. మీనాక్షికి కన్నెరికంబెట్టిన చౌదరయ్య పాతిక చీరెలు తెచ్చాడు నూలువి, సిల్కువి కలిపి. ఆతరువాత మీనాక్షి సంపాదించినవి మూడుబీరువాలనిండా వున్నయ్. ఏ విషమసమ యంలో గూడా యిస్త్రీబట్టను రెండురోజులకంటె మీనాక్షి ఎక్కువకాలం కట్టలేదు. అయితే మీనాక్షి యిస్త్రీబట్టలను కట్టడం మానుకొని ఆరునెలలు గావొచ్చింది, ఇప్పటికి. బస్తీలో చాకలివాళ్ళు దొంగవెధవలని నాగేంద్రం చెప్పడంచాత

మీనాక్షి తనగుడ్డలను నాగేంద్రంవాటితోసహా స్వయంగా వుతికేది వాళ్ళని నమ్మలేక.

ఈ సంగతులన్నీ మీనాక్షికి తెలియకపోలేదు. అయినా అది "కులట" జీవితం. ఇది "సంసారి" జీవితం. ఎన్నోథక్కా-మొక్కీలు తింటేనేగాని ఈ రెండవదాంట్లో నిభాయించడం కష్టం. చెడును సంపాదించుకోడానికి కొన్ని నిమిషాలు చాలు. కానీ ఆచెడును నిర్మూలించి ఆ స్థానంలో మంచిని వుంచాలంటే ఎన్నోసంవత్సరాలు కావాలి. ఈలోపుగా ఆవ్యక్తి ఎన్నో అగ్నిపరీక్షలకు తట్టుకోవలసి వుంటుంది. అప్పటికిగాని సత్ఫలితం కలగదు. ఈవిషయాలన్నీ మీనాక్షికి తెలిసింతరువాత చీరలను గురించి అంత గట్టిగా ఎప్పుడూ అడగలేదు.

## 5

ఇప్పుడు మీనాక్షి కడుపుతో వుంది. ఇంటిపని చేయలేక నానాఅవస్థ పడుతోంది.

"ఈ నెలరోజులు వొక పనిమనిషిని కుదర్చండి. నేను చేయలేకుండావున్నాను" అంది మీనాక్షి.

"ఎన్నింటికని చావను? అందులో ఈ నెలనుండీ యింటి అద్దె అయిదురూపాయ లెక్కువయింది. నీకంటే ముందే నాకీ వూహాతట్టింది. ఈనెల మొదటే వొకపనిమనిషిని మాట్లాడాను. అద్దెపెరగడంచాత దాన్ని మానుకోమని చెప్పాలిసొచ్చింది. యాభయ్ రూపాయల్లో ఎన్నని సర్దను?" అన్నాడు నాగేంద్రం.

మీనాక్షి కిప్పుడు ఆరోనెల అయినా ఇంటిచాకిరంతా చేస్తూనేవుంది. దానికి తోడు ఎదో నలత వొంట్లో ప్రవే

సించింది. అయినప్పటికీ వాళ్ళింట్లో వున్న రెండు మంచా ల్లోనూ వొకదానికి బూజుపట్టింది. దాన్ని ఈ సంవత్సరంన్నర కాలంలోనూ ఏపదిదఫాలో కంటే ఎక్కువ వాడలేదు.

ఒకనాటిరాత్రి మీనాక్షి అర్ధజాముదాకా మూలిగి అప్పుడే కునుకుదీసింది. అంతవరకూ నిద్రబట్టక తన్నుకొంటున్న నాగేంద్రం అప్పుడే కునుకుపట్టిన మీనాక్షిని తనవేపు తిప్పు కొన్నాడు. గట్టిగా తనకు ఆనించుకొని నొక్కుకొన్నాడు. మీనాక్షికి మెలుకువ వొచ్చింది. అభ్యంతరం చెప్పింది. "వొంట్లో సరిగాలేదు" అన్నది. కడుపువేపు చూపి బతిమా లింది. వోపికనంతా కూడగట్టి ఎదురు తిరిగింది. నాగేంద్రం యినుపగరిటెతో గొడ్డును బాదినట్టు బాదాడు. మీనాక్షి శోకాలు పెట్టింది. చుట్టూ ఇళ్ళల్లోవున్న ఆడంగులు మీనా క్షిని ఓదార్చటానికి రాలేదు. పైగా "ఏం, మ్హాయరోగ మొచ్చిందా...కి...బోగందీ భోగంవగలు" అని తమ మొగు ళ్ళను గట్టిగా కావిలించుకొని నిశ్చింతగా నిద్రపొయ్యారు. ఏది ఏమయినప్పటికీ ఆరాత్రి తనఅవసరాన్ని మాత్రం తీర్చుకోగలిగాడు నాగేంద్రం అప్పటికి మీనాక్షికి ఎనిమిదో మాసం నిండింది.

మీనాక్షి దెబ్బలు తినడం ఇది నాలుగోసారి. కార ణాలుమాత్రం ఇవే, ఒకసారి కొంచెం తలనొప్పిగా వుంది. అదీ అవ్వేళ మధ్యాహ్నం నిద్రపోకపోవడం మూలాన. ఆరాత్రి వొక ఆసామివొచ్చి రాత్రికి పాతికరూపాయ లిస్తాననాన్నడు. తల్లి ఎంతో బతిమాలింది. మీనాక్షి ఒప్పుకోలేదు. డాక్టరు చేత ఇంజెక్షన్ తీసుకొంద్ది తలనొప్పికి. ఇది మీనాక్షి "కులట"

జీవితంలో సంగతి. "సంసారి" జీవితంలో కొచ్చిన తరువాత ఎనిమిది నెలలగర్భంతో మొగుడికి లొంగిపోలేదని చావ తప్పించుకొంది.

# 6

మీనాక్షి నీలాడింది. అప్పటినుండీ మీనాక్షి మంచం లోనించి లేవదు. పిల్లాడికి తల్లి పాలు చాలడంలేదు. అందులో "రోగిగావున్న తల్లి పాలు పట్టడం మహాప్రమాదం" అన్నారు కొంతమంది. పిల్లాడు పూర్తిగా డబ్బాపాలమీద ఆధారపడ వలసివొచ్చింది.

"ఎక్కడిడబ్బా పీడిబొందమీదికే చాలడంలేదు. ఎన్ని పాలడబ్బాలని తేను? యాభయ్ రూపాయల్లో ఎన్నని సర్దను?" అన్నాడు నాగేంద్రం.

పాలు లేక చిక్కిపోతున్న తనకొడుకుని చూచి బావురు మని ఏడ్చింది మీనాక్షి "ఈ నిర్భాగ్యురాలి కడుపున ఎందుకు పుట్టావురా నాయనా!" అని నాగేంద్రం చూడకుండా శోకాలుపెట్టింది.

మీనాక్షి పూర్తిగా కోలుకొనేటప్పటికి ఆరుమాసా లైంది. అయితే మీనాక్షికి బదులు పసిపిల్లడు జబ్బునపడ్డాడు. డబ్బాపాలు చాలడంలేదు. అవయినా పిల్లాడు ఇముడ్చుకో లేకపోతున్నాడు. కళ్ళు గోతుల్లాగ తయారయినై. చేతులు, కాళ్ళు పూచికపుల్లలకంటె హీనం. కడుపు గుమ్మడికాయంత వుంది.

"ఇది లివరుజబ్బమ్మా! జమ్మివారిమందు వాడండి. చప్పున తగ్గిపోతుంది. మొన్న వెంకమ్మత్త కూతురుకు..." అన్నారొకరు.

ఆనాటి రాత్రి నాగేంద్రంతో ఆ సంగతి చెప్పింది మీనాక్షి. "నిజమే పాపం! ఏం చెయ్యమంటావు?" అన్నాడు నాగేంద్రం. మీనాక్షి ఏమీ చెప్పలేదు. నిద్రలో గురకపెడు తున్న కొడుకును గుండెల్లోకి తీసుకొని తడిసిన కళ్ళను మూసింది,

అర్ధరాత్రప్పుడు పిల్లాడికి బదులుగా నాగేంద్రం తగిలాడు.

"నేనేలే. ఏదీ ఇట్లా తిరుగు" అన్నాడు నాగేంద్రం మీనాక్షిపొత్తికడుపుకింద తడుముతూ.

"పిల్లాడు" అంది మీనాక్షి లేవబోతూ, నాగేంద్రం మీనాక్షిని లేవకుండా అదిమిపట్టి "రేప్పొద్దున డాక్టర్ని పిలు స్తాను...ఇందాక అబ్బాయిని చూస్తే నాగుండె తరుక్కు పోయింది" అన్నాడు. మీనాక్షిలోని "మాతృహృదయం" కరిగిపోయింది. తన చిట్టిబాబు ఆరోగ్యంకోసం తనవొంట్లో "సరి" లేకపోయినా తెల్లవార్లూ నాగేంద్రంచేతుల్లో వొం పులుతిప్పబడింది.

నాగేంద్రం సత్యహరిశ్చంద్రుడుకాడు. కనీసం కృత యుగంలోని మనిషన్నాకాడు (ఆ యుగంలోనివాళ్ళు మంచి వారని ఈ రచయిత ఎప్పుడూ అభిప్రాయపడలేదు. అది రచ యిత తప్పుకాదు.) అన్నమాట చెల్లించడానికి. అతను సర్వ సాధారణమైన మనిషి.. మీదు మిక్కిలి పందొమ్మిదో శతా

బ్రకాలంవాడు. (ఇది ఇరవై రెండోశతాబ్దమని అనడం అనుచితం. "శ్రీ శ్రీ" తో ఈ రచయిత ఏకీభవిస్తున్నాడు) అంచేత ఆ తెల్లవారి డాక్టర్ని పిలవవలసిన అవసరం నాగేంద్రానికి లేదు.

# 7

పిల్లాడు చచ్చి నెలరోజులు దాటింది ఈ దిగులు వల్ల అణిగిపోయిన మీనాక్షి రోగం తిరగబెట్టింది. అంత రోగం తోనూ ఇంటి చాకిరీ చేస్తూనేవుంది. నాగేంద్రం మహా భయ స్తుడు. అంచేత రాత్రిళ్ళు వొంటరిగా పడుకోలేడు. రోగంతో మూలుగుతున్నా సరే మీనాక్షిని తోడుజేసుకొని పడు కొంటాడు; అప్పటికిగానీ నాగేంద్రం నిర్భయంగా నిద్రపోలేడు.

ఒకనాటి రాత్రి మీనాక్షి ఎందుకో లేచింది. దీపం సన్నగా వెలుగుతూవుంది. నాగేంద్రం పక్కలోలేడు. బైటికెళ్లా డేమో ననుకొంది. అరగంట కయినా రాకపోవడంచాత బైట చూద్దామని తలుపుతీయబోయింది. చాలాసేపటికిగానీ బైట గొళ్ళెం పెట్టబడిందని మీనాక్షి తెలుసుకోలేకపోయింది.

ఆ తెల్లవారి నాగేంద్రాన్ని అడిగింది.

"ఆఁ, నీ ముఖం......కలవరించావేమోలే!" అన్నాడు నాగేంద్రం.

అట్లాంటి కలవరింపులు మీనాక్షి చాలాసార్లు కలవ రించింది. వొక వారం రోజులు పట్టుబట్టి చూసింది. అన్ని రోజులూ మీనాక్షి ఆవిధంగా కలవరిస్తూనేవుంది. పోతే నాగేంద్రం వొక అమ్మాయిని "లవ్" చేశాడని తనకు రాత్రిళ్ళు పక్కలో నాగేంద్రం లేనట్లు 'కలవరింపులు' రావ

డానికి ఆ "లవ్వే" కారణమని మీనాక్షికి చాలాకాలందాకా తెలియ లేదు.

పాపం ఎక్కువకాలం దాగదు. మీనాక్షికి ఆవిధమైన కలవరింపులు రావడం ప్రారంభించిన రెండుమాసాలకు నాగేంద్రం వొంటినిండా చారెడేసిపొడలు పుట్టినయ్. పక్షంరోజులు తిరక్కముందే మీనాక్షి వొంటిమీదికి ఈ పొడలు పాకడం జరిగింది. నాగేంద్రం "లవ్" చేసిన అమ్మాయి వందరూపాయలు ఖర్చుబెటి తన "లవర్" శరీరాన్ని మరమ్మత్తు చేసుకొంది. మీనాక్షి అవసరం నాగేంద్రానికే పట్టనప్పుడు, నాగేంద్రం "లవర్" కేం అవసరం?

మీనాక్షి పని యిప్పుడు నానా గజాటుగా వుంది. తన శరీరాన్ని నాగేంద్రానికి చూపించి డాక్టర్ని పిలవమని బతిమిలాడింది. అప్పుడు నాగేంద్రం తాగివున్నాడు. ఆసంగతి మీనాక్షికి అప్పుడే తెలిసింది.

"...ఇంకా దొంగవగలు పడతావేం? నానా గాడిదలతో తిరిగి అడ్డమైన రోగాలన్నీ వొంట్లోకి పట్టించుకొన్నావ్. అవన్నీ నాకు ఎక్కించి నా ఆరోగ్యం నాశనం చేశావ్. నువ్వసలు భోగం...వి నాయింట్లోనించి ఫో..." ఈ వరసలో వెళ్ళాడు నాగేంద్రం. ఆఖరికి మీనాక్షిని స్పృహతప్పేటట్లు తన్ని బైటికీడ్చాడు.

చుట్టుపక్కల జనం "భోగం...! భోగం వగలూ" అన్నారు.

మీనాక్షి వొక్కసారి తన పాతజీవితంలోకి తొంగి చూసింది. అదెంత హాయయిన జీవితం? ఎంత డబ్బిచ్చినా

నచ్చని వాడుంటే తిరస్కరించే ప్రాథమిక హక్కు ఆజీవితంలో దొరుకుతుంది. సర్వసంపూర్ణమైన బతుకు. తనకావిలింత కోసం వందలమంది తిరుగుతుంటారు. ఎంతో ఆకర్షణ, వెలుగు, మధురంగా పొంగుతూవుంటుంది. క్షుద్రమైన సంసార జీవితం! మొగుడు నచ్చినా నచ్చకపోయినా నచ్చినట్టు నటించాలి. తన ఆరోగ్యం ధ్వంసమయివున్నా మొగుడిచేతుల్లో వొంకలు తిరగాలి. తిండికోసం, గుడ్డకోసం, చివరికి జడరిబ్బను కోసం మొగుడికి శరీరాన్ని వొప్పజెప్పిందాకా గతిలేదు. అయితే భోగంవాళ్ళకీ సంసారులకీ ఎక్కడ భేదం? భోగంది వందరూపా యలకు నచ్చినవాడికి శరీరాన్ని వొప్పగిస్తుంది. సంసారస్త్రీ రిబ్బనుకోసం కుళ్ళుమొఖం భర్తను కళ్ళుమూసుకొని ఏడుస్తూ భరిస్తుంది. తన కిష్టంలేకపోతే ఆలోకంలో తిరస్కరించవొచ్చు. "మన సభ్యత" "మన సంస్కృతి" అవి బొదబొదలాడే జబ్బులు చెరుచుకొనే ఈలోకంలో ఆడదాని ఇష్టాఇష్టాలతో నిమిత్తం లేదు వేడితగ్గితే సరి.

మీనాక్షి తన మొదటి జీవితంలోకి వెళ్ళాలనుకొంది. "ఉత్తమమైన సంసార రంగం" (???) మీనాక్షి జీవితాన్ని ధ్వంసంచేసింది. ఉన్న సౌందర్యమంతా నాగేంద్రం పీల్చుకొ న్నాడు. పిప్పివి బైటికి గెంటాడు. ఆకర్షణ కాంతి లేని బతుకు మీనాక్షిది ప్రస్తుతం. ఇక తనముఖ మెవరు చూస్తారు? తన గతేమిటి?

"భగవంతుడా?" అంది మీనాక్షి చేతులు జోడించి.

భూలోక వ్యవహారాలతో పూర్తిగా తెగ తెంపులుచేసు కొన్న భగవంతుడు "నాకెందుకు" అని చప్పగా నిద్రపోయాడు.

# నష్టజాతకంలు

ఆరోజులే వేరు. ఆ కాలమే వేరు. ఇది జరిగి ఇప్పటికి నాలుగైదు సంవత్సరాలు కావస్తున్నది! ఈలోగా తనెంతో మారిపోయింది! జీవితం, బరువుగా తనమీద సవారీ చేసింది! ఎన్నో సుఖాలు, దుఃఖాలు, తృప్తి, అసంతృప్తి —. ఇలాంటి వెన్నో తను అనుభవించింది. అలా అనుభవించడం ఇష్టమయినా, కాకపోయినా, అనుభవించడం మాత్రం తప్పలేదు.

నిజంగా ఆరోజులు ఎంత హాయిగా ఉండేవి! ఎంత ఆనందంగా తను గడిపింది! ఎన్నికలలు కన్నది! ఎన్ని రాత్రిలు నిద్రలేకుండా అలానే ఆలోచిస్తూ పడుకొన్నది!

తలుచుకొంటే ఇప్పటికీ గుండెలు జలదరిస్తాయి. మనస్సు, ఎటో ఎటో తేలిపోతుంది! అప్పటికి తనకింకా ఏవిషయమూ తెలీదు. కానీ, ఏదో తెలిసినట్టుగామాత్రం ఉండేది. తెలిసినట్టుగానే తనూ వ్యవహారించేది!

అప్పటికే తను పరికిణీలు, వోణీలు వదిలేసింది. బామ్మ చీరెకట్టుకు తీరాలని, నానా యాగీ చేసింది. తన మాట అమ్మ కాదనలేకపోయినా, బామ్మనుగూడా కాదనలేకపోయింది! బామ్మ వాదన నిజమే! పదహారు, పదిహేడు సంవత్సరాలపిల్ల, ఇంకా పరికిణీలు కట్టుకొంటే, ఏం బావుంటుంది?

తను కొత్తగా చీరె కట్టుకొని, అది కాళ్ళకు అడ్డం పడకుండా, రవంత ఎత్తిపట్టుకొని, దొడ్లోకి వెళ్ళినప్పుడు. దడివెనక నుంచి ఓ చిరునవ్వూ, ఆవెంటనే ఓ నిట్టూర్పూ తనకు వినిపించాయి.

తను అటు కేసి చూసింది!

స్నానంచేస్తున్న రాజారావు, చెయ్యడం ఆపి, తన వేపు అదోలా చూసి, తలవంచుకొన్నాడు. అప్పుడు తన కెంత సిగ్గేసిందో చెప్పలేదు. ఏదో తప్పుచేసినదానిలా తలొంచుకొని, బిరబిరా ఇంట్లోకి వెళ్ళిపోయింది.

'పిన్నిగారింటికెళ్ళి కొత్తిమిరి పెట్టించుకు రమ్మ'ని అమ్మ అన్నప్పుడు, తను పరికిణీ కట్టుకొనిగానీ, పిన్నిగారింటికి వెళ్ళనని, పట్టుబట్టింది.

'అదేమిటే, నీ తలపుండుపుచ్చా! ఆడదయింతర్వాత చీర కట్టుకోదుటే! అందుకే ఇంత సిగ్గా? నా చిన్నప్పుడు నేను —తొమ్మిదో ఏటనే, పదహారుమూళ్ళ పత్తిపాదు చీర కట్టుకొనేదాన్ని. ఇంకేం. పెద్దదానివి కాకుండా, అలాగే బొప్పిలా ఉండకపోయావా, గౌన్లు వేసుకొనేదానివి! ఫో ఫో, చాదు దించాలి గానీ, కాస్త కొత్తిమిరిరెబ్బ పుచ్చుకురా!' అన్నది అమ్మ.

భిడియపడుతూనే, తను పిన్నిగారింటికి వెళ్ళింది. తన యీ ఆకారం చూసి, పిన్నిగారు ఏం ఎగతాళిచేస్తుందోనని, గుండెలు పీచుపీచుమంటున్నాయి. కాళ్ళు తడబడుతున్నాయి. మెల్లిగా ఒక్కొక్క మెట్టే ఎక్కుతూ, లోపలికి వచ్చింది! ఇంట్లో అలికిడేమీ లేదు. వంటింటినుండి పొగమాత్రం వస్తోంది. తను అటూ ఇటూ చూడకుండా, గబగబా వంటింటి కేసి వెళ్ళింది. ఆతరువాత, ద్వారబంధం పట్టుకొని, దొడ్డంతా కలయచూసింది. ఇంట్లో ఎవ్వరూ లేరు. తలుపులన్నీ బార్లగా తీసి ఉన్నాయి.

'పిన్నిగారూ!' అని పిలిచింది తను.

'ఎవరది?'

అది రాజారావు గొంతు.

తన కెందుకో వల్లమాలిన భయం వేసింది. కాళ్లు గడగడ వణికాయి. ముచ్చెమట పోసింది. ఇలా జరగడం, తనకు అదే మొదలు.

'ఏమిటి శారదా' అన్నాడు రాజారావు, వాకిలికి అడ్డంగా నిలబడి.

చిత్రం! తనకు కావలసిన దేమిటో, ఆ క్షణాన తను మరిచిపోయింది! భయం! ఒకటే భయం!! వయస్సులో ఉన్న ప్రతిఆడదీ, వయస్సులో ఉన్న మొగవాణ్ని, ఒంటరిగా కలుసు కొన్నప్పుడు, అలానే భయపడుతుందేమో!

'ఏం కావాలి శారదా? ఎందు కలా వణికిపోతావ్?' అన్నాడు రాజారావు దగ్గరకొస్తూ.

తనకు దాదాపు మైకం కమ్ముతున్నట్టయింది. ఏదో, ఓ బ్రహ్మాండమైన సంఘటన జరిగిపోయిందనీ, అప్పుడు తను ఏమిటో అయిపోక తప్పదనీ, అనిపించింది. కానీ ఏమీ కాలేదు. రాజారావు దగ్గిరకొచ్చి, తనచెయ్యి పట్టుకొన్నాడు. తను గింజు కొందామనుకొంది. కానీ ఆపని చెయ్యలేకపోయింది. నోటికి వచ్చినట్లు, చెడామడా తిడదామనుకొంది. కానీ గొంతు పెగిలి చావందే!

ఆనాడు తను అలా చేసిఉన్నట్లయితే, పరిస్థితులు, ఇప్పటిలా కాక, మరోలాఉండేవి! ఆ క్షణాన ఏ శక్తులు తనను ఆవేశించాయో తెలీదు. తనేమీ చెయ్యలేకపోయింది! అతని ముఖంలోకి చూస్తూ నిలబడిపోయింది.

'ఇలా రా. మాట' అన్నాడు రాజారావు.

తను 'రా'నంచామనుకొంది. అనుకొని అతనివెంట గది లోకి వెళ్ళింది!

'కూచో' అన్నాడు రాజారావు.

తను కూచోలేదు.

రాజారావు ఓ నిమిషం తన కేసి తినేసేవాడిలా చూశాడు. అతని కళ్ళు క్రమక్రమంగా ఎఱ్ఱబడుతున్నాయి. ముకుపుటాలు ఉబికించి, పెద్దగా గాలి పీలుస్తున్నాడు. అతనికి గూడా వంటినిండా చెమటలు దిగజారి పోతున్నాయి మెల్లిగా వచ్చి తన రెండుభుజాలమీదా చేతులువేసి, తనను కౌగలించు కొన్నాడు. తను కొంచెంగా పెనుగులాడింది.

అంతవరకు తనకు జ్ఞాపకం! ఆతరువాత, ఏది ఏమైందో తనకు తెలీదు. ఒళ్ళంతా బరువు తీరి, గాలిలోకి తేలిపోతున్నట్టు అనిపించింది. ఏదో ఓ ఆనందం, ఓ మహాశాంతి తనకు లభించి నట్టు తోచింది. అది భ్రమే ననిపించింది తనకు. కాకపోతే, తను పడుతున్న బాధలుగానీ, అశాంతిగానీ ఏమీ లేవే మరి!

అసలిల్లా తన మనస్సుమనస్సులో లేదు. ఇంకా, తాను ఒంటరిగా ఉన్నట్లు, ఆరాజారావు తన భుజాలమీద చేతులు వేసి, దగ్గరగా తీసుకొని, గుండెలకు ఒత్తుకొన్నట్టూ అనిపి స్తూ ఉంది తనకు.

'ఏమిటేవ్, మనవరాలా! అలా ఉలికులికిపడుతున్నా వేమిటి? ఒంట్లో బాగా లేదేం?' అంది కామాక్షమ్మ.

అప్పటిగ్గానీ తనకు తెలిసిందిగాదు: తన ప్రవర్తనలో ఏదో మార్పు వచ్చిందని! ఆ క్షణంనుండే, తాను జాగ్రత్తగా

మసలడం నేర్చుకొంది! ఎంత ప్రయత్నించినా. ఆ 'ఉదుటు' తన వెన్ను మీదనే ఉంది.

పెందరాడే రెండు మెతుకులు తిని, లేచి ఆవలింతలు నటిస్తూ, గదిలో చేరుకొంది! ఏదో చదువుదామని నాలుగైదు పుస్తకాలు కెలికింది. కానీ చదవబుద్ధిగాలేదు. ఏమీతోచడం లేదు ఎందుకో తెలీని చిరాకు—చప్పున అద్దంముందు నిలబడి, తనను తాను చూసుకుంది!

ఎంత అందంగా ఉంది తను! పచ్చగా ఉండే తన ముఖం లైటు వెలుతురుపడి అద్దంలో మరింత పచ్చగా కనపడుతోంది. చెవులకున్న నీలాల దుద్దులు తళతళలాడుతున్నాయి. భాగ్యమ్మత్త పూసిన గంధం ఎండిపోయి, సగభాగం రాలిపోయింది. పలచని వాయిల్ చీరెలో—అప్పుడే తనకు ఉదయపుసంఘటన జ్ఞాపకం వచ్చింది! శరీరమంతా పులకలు దేరాయి. ముఖం ఎందుకో ఎర్రబడింది! ఓ చిన్ని నవ్వు, పెదిమల మధ్య నలిగిపోయింది!

రాజారావు తాకిన పెదిమలివి! అతను కౌగలించుకొన్న శరీరమిది? తనకు ఎల్లమాలిన సిగ్గువేసింది! అద్దంలో తనను తాను చూసుకోలేకపోయింది. రెండుకళ్ళూ మూసుకొని, పక్కమీద జారగిలబడ్డది! అప్పుడే ఏదో మత్తు తనను ఆవరించింది! ఎవరో ముఖంమీది తనచేతులను బలవంతంగా లాగుతున్నారు...

రాజారావు!

'ఇశ్శో. పెద్దగా అరవకు... అంతా నిద్రపోతున్నారు' అన్నాడు రాజారావు.

'ఎనిమిదింటికేనా?' అన్నది తాను అప్రియత్నంగా.

'నీకు టైంకూడా తెలీదని, నాకు ఇప్పటిదాకా తెలీదు' అన్నాడు రాజారావు.

ఒంటిగంట!

'రోజూ పది దాటకుండానే పడుకొనే నువ్వు, ఇవ్వాళ ఎందుకు పడుకోలేదో, చూదామని వచ్చాను. అద్దంముందు నిలబడి, నీలో నువ్వు, తన్మయురాలివయిపోతున్నావు' అన్నాడు రాజారావు మెల్లగా నవ్వుతూ.

'అయితే అయింది. నువ్వెందుకొచ్చావ్?' అన్నది తాను.

'పిచ్చిదానా! అర్ధరాత్రి దాటినా, తలుపులు వేసుకోకుండా ఉన్నావంటే, ఏమి జరిగినా జరగవచ్చు. అందుకనే, నిన్ను హెచ్చరిద్దామని వచ్చాను. అంతవరకే నేను నావశంలో ఉన్నాను. ఆతర్వాత నిన్ను విడిచి పోబుద్ధికాలేదు' అన్నాడు రాజారావు.

రాజారావును తనేమిటో అందామనుకొంది. ఏమిటో చేదామనుకొంది. కానీ, తన ఆలోచనలకు రాజారావు ఎడమివ్వలేదు. లైటు ఆర్పేశాడు. తలుపులకు గడియబెట్టాడు. బిగ్గరగా కేకలుపెడదామని నోరు విప్పింది! రాజారావు బలమైన పెదిమలు, తన నోటిని మూశాయి. అతనిచేతులు తనను పెనవేసుకొన్నాయి. కళ్ళు మూసుకుపోయాయి. నెత్తురు గోళ్ళ చివర్లకొచ్చింది...

మానవజాతికీ, ప్రకృతికీ సరిపడదేమో ననిపిస్తుందితనకు లేకపోతే తన రహస్యం కాస్తా బైటపడదు మరి! వరసాగ్గా

రెండుమూడు నెలలు తను బైటగదిని వాడుకోకపోయేసరికి అమ్మా బావమ్మా, గుసగుసలాడారు. తనను చాటుకు పిలిచి, ఎన్నోవిధాల గుచ్చిగుచ్చి అడిగారు. మొదట తాను కాదని బుకాయించినా, చివరకు అంగీకరించక తప్పలేదు.

ఆ తరవాత నానాఅల్లరీ జరిగింది. నాన్న ఉరిబోసుకొని చస్తానన్నాడు. అమ్మ బావిలో దూకుతానన్నది! కానీ, ఏమీ జరగలేదు. పదిహేనువేల కట్నమిచ్చి, ఈయనకు అంటగట్టారు. ఈ పెళ్ళి జరక్కుండా చెయ్యాలనీ తన తమ్ముడికే నన్ను ఇప్పించాలనీ, 'పిన్ని' గారు, ఎన్నో ప్రయత్నాలు చేసింది! ఆఖరుకు రాజారావుగూడా నాన్నను అడిగాడు.

ఇప్పటికీ తన కా అదృష్టం లేదు.

అదే ఆఖరుసారి తన రాజారావును చూడటం! ఆ తరవాత అతనుగూడా, అక్కగారింటి నుండి ఎటో వెళ్ళిపోయాడు. కొంతకాలం పిచ్చివాడిలా తిరిగాట్ట! తరవాత పెళ్ళిచేసుకొన్నాడనీ, అదేదో ఊళ్ళో, ఉద్యోగం చేస్తున్నాడనీ, పిన్నిగారు చెప్పింది. అప్పుడప్పుడు రాజారావు పిన్నిగారింటికి ఉత్తరాలు రాసేవాడు. ప్రతీ ఉత్తరంలోనూ తననుగురించి, చేటభారతమంత ఉండేది.

ఏది ఏమైతేనేం గానీ, అదంతా గడిచిపోయింది. మళ్ళీ ఈ జీవితంలో తను, రాజారావును చూస్తాననుకోలేదు. కానీ, ఇందాక పెళ్ళిపందిట్లో కనిపించాడు. మనిషికి, అట్టే చీకూ చింతా వున్నట్టులేదు. అప్పటిలాగానే, నవ్వుతూ నవ్విస్తూ, హడావుడిగా తిరుగుతున్నాడు. తనను చూశానన్నట్టుగా కను

బొమలు ఎగరేసి, ఓ నవ్వు నవ్వాడు. ఆ వెంటనే ఉన్నావిడ —అతనిభార్య గావును! ఎంత అసహ్యంగా ఉందీ—

ఒక్కసారి లైట్లు వెలిగాయి. ఓ క్షణం, శారద కళ్ళు మిరుమిట్లుగొన్నాయి. ఆమె కుర్చీలో అటూఇటూ కదిలి, కళ్లు నులుముకుంది! ప్రక్కనే, 'వసంత్' నిద్రపోతున్నాడు. పొన్నాయి చెట్టుమీాంచి, రయ్యిన గాలి వీచింది. గోడవతల, కుక్కలు కొట్లాడుకొంటున్నాయి. క్రింద, పెళ్ళిగొడవలు, దూరంగా, బాజాభజంత్రీలు రణగొణధ్వని!

'నువ్వు, మళ్ళా కనిపిస్తావేమోనని, పందిరంతా వెదికాను. ఇక్కడ కూచున్నావేం శారదా!' అంటూ రాజారావు పైకొచ్చాడు.

శారద, ఏదో అనబోయింది

'ఈ పడుకున్నదెవరు?......నీ కొడుకా ఏం?'

'ఊఁ' అన్నది శారద.

ఆమెకు విచారం పుక్కిలింత లవుతోంది! రెండుచేతుల తోనూ ముఖం కప్పుకొని, వెక్కివెక్కిపడుతోంది.

'నువ్వింకా, ఆవిషయం మరిచిపోలే దన్నమాట! నిన్ను చూసిందాకా, నాకా సంఘటనలే గుర్తుకు రాలేదు శారదా! ఈ జ్ఞాపకమనేది ఉన్నది చూశావూ, మహాచెడ్డదనుకో! దాన్ని సాధ్యమైనంతవరకూ చంపిపారేయాలి...తిరిగి నిన్ను ఎప్పుడు కలుసుకొంటానో ఏమిటో? నేనీ తెల్లవారుఝామున బండికి వెడుతున్నాను. చెప్పిపోదామని వచ్చాను'అన్నాడు రాజారావు.

'మరో రెండురోజు లుండకూడదూ?' అన్నది శారద.

'సెలవులేదు.'

శారద మనస్సులో ఏదో మెరిసింది. ఏదో చెప్పుదామని, నోరు తెరిచింది. అప్రయత్నంగా వసంత్ కేసి చూసి, ఓ నిట్టూర్పు మాత్రం విడిచింది.

'నీతో ఎన్నో సంగతులు మాట్లాడదామనుకొన్నాను. కానీ నువ్వెళ్ళిపోతున్నావు...నీకేమీ అభ్యంతరం లేకపోతే, ఈ రాత్రికి రాగలవా? నే నీ గదిలోనే ఉంటాను'

రాజారావు ఓనిమిషం ఆలోచించి, ఓచిన్ననవ్వు నవ్వి 'సరే' నన్నాడు.

'ఇక నేను వెడతాను. మనమిద్దరం ఇలాఉండటం ఎవరన్నాచూస్తే బావుండదు......అదిగో, మా శకుంతల కేక వేస్తోంది. రాత్రికి తప్పకుండా వస్తాను.'

రాజారావు మెట్లుదిగి వెళ్ళిపోయాడు.

శారద కుర్చీలో కూలబడింది.

'శకుంతల! హుఁ, భార్యగావును. ఛీఛీ..—ఎంత అసహ్యంగా ఉంది!' అనుకొంది శారద.

కిందికెళ్ళి, ఆదరాబాదరా రెండుమెతుకులు తిని, తాంబూలం వేసుకొంటోంది శారద.

'ఊరేగింపు బయలుదేరుతోంది. నువ్వింకా ఇక్కడే కూచున్నావేమిటే! రావా ఏం?' అన్నాడు నారాయణ.

'ఎందుకురానూ! ముందు మీరు పదండి! బాబిగాడింకా లేవలా. లేవంగానే, వాడికి నంజబెట్టి వస్తాను. మరి మీరు రారూ?' అన్నది శారద, భర్త ముఖంలోకి చూస్తూ.

'సడేలే! రాకపోతే ఏంబావుంటుంది? వాడేమన్నా పరాయివాడా ఏమన్నానా! స్వయానా, మా మేనత్త ఆడ

బడుచు పెంపుడు కొడుకొచ్చాడు కే! రాకపోతే ఏమన్నా అను కోదూ!' అన్నాడు నారాయణ.

'బ్రతికించారు!' అనుకొంది శారద.

భోజనాలయినాయి. ఊరేగింపుసాగారిందాకా అటూ ఇటూ తచ్చాడింది శారద. తరవాత, వెనక వేపుగా, మెట్లెక్కి మేడమీదికొచ్చింది! భుజంమీద నిద్రపోతున్న వసంత్ ను, మంచంమీద పడుకోబెట్టి, దుప్పటికప్పింది. ఆమె కెందుకో, గుండెలు గుబగుబమన్నాయి. లైటు ఆర్పేసి తలుపు దగ్గరికి నొక్కి, కుర్చీలో చతికిలబడింది!

క్రమంగా మేళాలు దూరంగా వెళ్ళిపోయాయి. వెన్నెల దిగజారిపోయింది! గోడవతలనించి పులిస్తరాకుల వాసన, గుబులుగుబుళ్ళుగా వస్తోంది. వంటింట్లో ఏదో చప్పుడు పెళ్ళిపందిట్లో ఓ వికారపు నవ్వు.

ఒళ్ళంతా చెవులుచేసుకొని వింటోంది శారద. మెట్ల మీాద అడుగులచప్పుడు. తన గదిదాకా వచ్చి, ఓక్షణం ఆగింది. తలుపు తెరుచుకొని తిరిగి నిశ్శబ్దంగా మూసుకొంది!...

శారద లేచింది. ఆమె హృదయం, వేగంగా కొట్టుకో సాగింది! ఆనాటి సంఘటనలన్నీ తలపుకు వచ్చాయి. వెర్రిఆవే శంతో అతన్ని కౌగలించుకొంది! గాజులు 'గల్లు' మన్నాయి.

'ఇశ్ ... చప్పుడు చేయకు'

శారద గుండెలు గుభిల్లుమన్నాయి. ఆమె నవనాడులూ కుంగిపోయాయి. ఆపాదమస్తకం వణికిపోతోంది! ఇప్పుడేమిటి తను చెయ్యడం? తను రాజారావుకోసం ఇక్కడ ఎదురుచూాస్తూ కూచున్నది! తనభర్త వచ్చాడు. అయినా తానిక్కడ ఉంటా

నని, ఈయనగారి కెలా తెలుసు? ఇప్పుడు బైటపడితే ఏమన్నా ఉందా? తన కేమిటి? భగవంతుడా. తనగ తేమిటి? ఈ గండం నుండి తప్పుకోవడం ఎలా?

'చాలా కాలానికి నిన్ను కలుసుకొన్నాను శకుంతలా! మళ్ళీ నిన్ను చూడగలనని అనుకోలేదు. పిచ్చిదానా! ఎందుకిలా వణికిపోతావ్? ఎందుకిలా కళ్ళంట నీళ్ళు పెట్టుకోవడం? నిన్ను చేసుకొనే అదృష్టం నాకు లేదు. ఉంటే, ఆ పదివేలకట్నానికే, మానాన్న ఒప్పుకొనేవాడు. శకూ! ఆనాటి మన ప్రణయం, నాకింకా జ్ఞాపకముంది! ఈ అందమైన మెత్తనిచేతులు, ఈచిన్ని నోరు, సన్నని పెదాలు...ఒకప్పుడు నావి. వీటికోసం నేను తపస్సు చేశాను. కానీ ఏంలాభం? అవి నావి కాకుండా పోయాయి. శకూ! మాట్లాడ వేం? రేపు మధ్యాహ్నమే మేము పోతున్నాం. తిరిగి నిన్ను ఎప్పటికిచూస్తానో? అసలు చూడనే లేనేమో!'

నారాయణ ఏదో అంటున్నాడు. శారద కి వేమీ విని పించడంలేదు. ఆమెలో తీవ్రమైన సంక్షోభం చెలరేగింది. రక్తం ఓర్చుకుపోయినదానిలా, కుప్పబడిపోయింది.

# చేసిన పాపం

చలమయ్యగారు దేశభక్తుడయినా, ఆయన దేశాన్ని గురించి పట్టించుకోక చాలా రోజులైంది. దేశభక్తుడుగా ఉన్నంతకాలమూ, దేశానికి ఆయనచేసిన సేవ విలువ లేనిదనే చెప్పాలి. స్వాతంత్ర్యం వచ్చింది కేంద్రంలోనూ, రాష్ట్రాల లోనూ కాంగ్రెసువారు అధికారాన్ని చేపట్టారు ఇప్పుడా యన్ని తెలుసుకొనే దిక్కు, ఆయన ఇంటికొచ్చే దిక్కూ లేదు.

ఒకప్పుడు చలమయ్యగారు, బాగాఉన్నవాడే! రెండెర కల వ్యవసాయం, ఝుంఝూమారుతంగా సాగింది! కూలీలు, నాలీలు ఇంటినిండా బిలబిల్లాడుతుండేవారు. పట్టుమని పదేళ్ళు జరగలేదు. చలమయ్యగారు దిగనాసిల్లిపోయాడు. ఉన్న పొల మంతా పోయింది.

'అది పోయిందన్న విచారం నాకు లేదు. పొలం అమ్మి నేనేమన్నా దుబారాచేశాను గనకనా విచారించడానికి? దేశా నికి ఖర్చుబెట్టాను. ఇప్పుడా దేశం నన్నెందుకు పోషించదూ'' అన్నాడు చలమయ్య.

ఆయనన్నట్లు, దేశం చలమయ్యగారిని పోషించలేదు సరిగదా, ఆయనగారుఉన్నాడన్న విషయాన్నే మరిచిపోయింది! తనను తాను జ్ఞాపకంచేసుకొనేందుకు చాలా ప్రయత్నించాడు చలమయ్య. అయినా ఆప్రయత్నాలు అక్కరకు రాలేదు.

చలమయ్య ఇప్పుడెందునా కాకుండా ఉన్నాడు. సుఖంగా ఇంటిపట్టున ఉండి తినడానికి, సరిపడ్డ భాగ్యంలేదు. కష్టపడి పని చేసే, ఓపికా, వయసూ లేదు. దీనికితోడు ఆయనకు పద్మగా

ఊప వొకటి వచ్చిపడ్డది! ఇంకెంతకాలం, ఆపిల్లను తను ఇంట్లో అట్టిపెట్టుకొంటాడు? దాని ఈడువాళ్ళు కాపరాలు చేసుకొంటూ, ఇద్దరేసిముగ్గురేసి బిడ్డల్నుగూడా కంటుంటే. తాను పద్మకింకా పెళ్ళన్నా చెయ్యలేదు.

చలమయ్యకు.—ఇదివరకు చాలా భ్రమలుండేవి! ఇండియాకు స్వాతంత్ర్యం రాగానే, ప్రజల్లో — బ్రహ్మాండమైన మార్పేదో, అమాంతం వచ్చిపడిపోతుం దనుకొన్నాడు. ఆక్షణంనుండీ ఇండియా భూలోక స్వర్గంగా మారిపోతుందనుకొన్నాడు. ఆయన భ్రమలు విచ్చిపోవడానికి ఎక్కువకాలం పట్టలేదు! దేశంలో, కొన్నిరకాల మార్పులేవో వచ్చినా, అవి —చలమయ్య ఊహించిన ప్రమాణంలో మట్టుకు లేవు.

ఈ సంగతి, పద్మసంబంధాల కోసం తిరిగినపుడు మరింత గ్రహించాడు చలమయ్య. పదివేలకు తక్కువ కట్న మడిగినవాడే లేడు. కొందరు భూవసతి, గృహవసతి వగైరాలను అడిగిచూసి, పెదిమ విరిచారు.

అసలు పద్మకు సంబంధాలే రాలేదనడానికి వీల్లేదు. అయిదారువచ్చాయి. అయితే ఆవచ్చినవి చలమయ్యకు నచ్చలేదు ఆయనకు నచ్చిన రెండు సంబంధాలూ పద్మతల్లికి నచ్చలేదు. అందరికీ నచ్చిన సంబంధాలు అందుబాటులో లేవు.

'నేను చాలా వెధవపని చేశాను. ఒళ్ళూపై తెలియకుండా ఆస్తంతా ఖర్చుబెట్టాను. ఇప్పుడు అన్నివిధాలా ఉడ్డుగుకిచి చస్తున్నాను! నిప్పుల కుంపటిలా పద్మ—మరోవేపున ప్రభాసిలా తిరుగుతున్న సుందరం! వీళ్ళిద్దర్నీ ఏమిచేసేట్టు?'అని చారించాడు చలమయ్య.

# 2

ఒకసారి ఎవరో ఈసంగతి చెప్పారు. ఆ మరునాడే చలమయ్య ఆ గ్రామంవెళ్ళి విచారించాడు. వాళ్ళు బాగా ఉన్నవాళ్ళే! లంకంత కొంపలు రెండున్నాయి. ఒక్కడే కొడుకు. ఆడపిల్లలు కూడా లేరు.

ఈ సంబంధం చలమయ్యగారికి బాగా నచ్చింది. ఆయన భార్యకు నచ్చింది. పద్మకు నచ్చిందీ, లేనిదీ తెలీదుగానీ, నచ్చినట్టే లెక్క. ఎందుకంటే, అమ్మా నాన్నా లగ్నాలు పెడుతున్నపుడు, పద్మ కాదనలేదు. ఆటే సంతోషాన్నీ చూపెట్ట లేదు.

పద్మ చిన్నదీచితకదీకాదు. ఇరవై మూడువెళ్ళిఇరవైనాలుగు వచ్చాయి. తనఈడువాళ్ళను చూసిన్నాడల్లా పద్మకు గుండెల్లో దేవినట్టుగా ఉండేది. అనేకమాట్లు, చాటునామాటునా కళ్ళనీళ్ళు పెట్టుకోవడం గూడా జరిగింది! అదీగాక తలిదండ్రిల స్థితిగతులు రోజురోజుకూ దిగనాసిల్లిపోతున్నాయి. తన వివాహం, ఓ గొప్ప సమస్యగా వాళ్ళను పట్టుకొన్నదని పద్మకు తెలుసు; కానీ, ఆమె చేయగలిగిన దేమీలేదు. ఉన్న ఆ ఒక్కమార్గమూ, తన సమస్యను పరిష్కరిస్తుందే గానీ, వాళ్ళకు కీర్తి తెచ్చేది కాదు!

ఏదోవిధంగా, తనో ఇంటిదాన్నవుతున్నా నన్న సంతోషం పద్మకు కలిగింది. అయితే, అది ఆవిడకు ఆటేసేపు దక్క లేదు. ఆ పెళ్ళికొడుకును గురించి, నలుగురూ నాలుగు రకాలుగానూ అన్నారు.

'ఆఁ, కిట్టనివాళ్ళు కిట్టనట్టుగానే చెబుతారు. అలాంటి సంబంధమైతే, నేనెందుకు ఎందుకుచేస్తానమ్మా తల్లీ! నువ్వేమన్నా మాకు పరాయిదానవా ఏమన్నానా? నువ్వు సుఖపడ్డం మా కిష్టంలేకనా? ఇల్లాంటి పిచ్చిపిచ్చి అశంకలు మనసులో పెట్టుకో మాక!' అన్నది తల్లి.

పద్మ ఏమనుకొందో ఎవ్వరికీ తెలీదు. పైకిమాత్రం ఏమీ అనలేదు. లక్షణంగా పెళ్ళయింది. మూడు నిద్రలయిన తరవాత ఏకంగా కాపరానికెళ్ళింది పద్మ ఆ వెళ్ళడం వెళ్ళడం, ఏణ్ణర్థందాకా, మళ్ళా తిరిగి చూడలేదు.

పెళ్ళయిన చాలా కాలానిగ్గానీ చలమయ్యగారికి అసలు సంగతి తెలియలేదు. తెలిసినతరువాత, ఆయన చాలా విచారించాడు.

'పాతిక సంవత్సరాలు అల్లారుముద్దుగా పెంచాను. చివరికి క్షయరోగి కిచ్చి పెళ్ళిచేశాను. ఆ సంగతి పెళ్ళికిముందే తెలిసినా, అది కిట్టనివాళ్ళు చెబుతున్నారనుకొన్నాను గానీ, నిజమనుకోలేదు. అయినా, అంత ఆస్తిఉన్నవాడికి, ముప్పయ్యేయిదేళ్ళదాకా, ఎందుకు పెళ్ళి కాలేదన్న ఆలోచనే నాకు రాలేదు!' అనుకొన్నాడు చలమయ్య.

ఈ దిగులు ఆయన్ని భూతంగా పట్టుకొని పీడిపించింది. మంచ మెక్కాడు. చివరికి తీసుకొని కన్ను మూశాడు.

# 3

ఇప్పుడు సంసార బాధ్యత యావత్తూ సుందరం మీద పడ్డది. వాడీ పదిహేను సంవత్సరాల్లోనూ రకరకాల ఉద్యోగాలు చేశాడు. ఎందునా ఇమడక చివరికి బీడీకొట్టు పెట్టాడు.

సుందరం బీడీకొట్టు పెట్టిన్నాడు ఊళ్ళో చాలామంది, చాలా రకాలుగా వ్యాఖ్యానించారు.

'ఈవృత్తి మంచిదా, చెడ్డదా అని నేను తర్కించడం లేదు. బ్రతకడం ముఖ్యమయినపుడు ఏదోవిధంగా బ్రతకాలి. ఇంతకన్నా వేరే జీవనోపాధి ఎవరన్నా చూపిస్తే, మహారాజుగా దీన్ని మానేస్తాడు. నన్ను తిప్పు పట్టేవాళ్ళు నన్నందుకు పైకి తీసుకురాగూడదు!' అన్నాడు సుందరం!

'ఒకరు పైకి తీసుకొచ్చేదేమిటి? నిజంగా పైకి పోవాలంటే నీకున్న అవకాశాలు ఇంకెవరికున్నాయిరా! అవతల బోలెడంత ఆస్తిఉంది!—' అన్నాడు స్నేహితుడు.

'నాదా? నాకా?' అన్నాడు సుందరం.

'నీదయినా కాకపోయినా, అది నీకే అవుతుంది. పద్మయినా, మగదిక్కులేకుండా పడిఉంది. జీతగాళ్ళను పెట్టుకొని వ్యవసాయం చేయించాలన్నా మాటలుకాదుగా! పోనీ, నువ్వే అక్కడికెళ్ళి ఉండగూడదూ?' అన్నాడతను.

సుందరం ఒప్పుకో లేదు.

అతన్ని ఒప్పించాలని చాలామంది, చాలా రకాలుగా ప్రయత్నించారు. ఆఖరికి తల్లిగూడా చెప్పిచూసింది!

'అమ్మా! డబ్బంటే నాకు ఆపేక్ష లేదనుకోకు. చాలా మందికంటే డబ్బు విలువ నాకు బాగా తెలుసు. కానీ అందు

కోసం జీవితంయావత్తూ నరకతుల్యం చేసుకోవాలంటేమాత్రం నా వల్లకాదు. సుఖపడ్డంకోసం, డబ్బు కావాలనుకొంటూనే, ఆ డబ్బుకోసం నానాబాధలూ పడడాన్ని నే సహించేసుకోలేక పోతున్నాను.' అన్నాడు సుందరం.

'మరెట్లాగురా తండ్రీ?' అన్నది తల్లి.

'పద్మకు చేతనైనసాయం చేయమంటే చేస్తాను గానీ, దానిబిడ్డను మాత్రం చేసుకోను. సరోజ చక్కదనాన్నిగురించి నే ననడంలేదు. ఆ మాటకొస్తే, చాలామంది ఆడపిల్లలకంటే సరోజ అందంగా ఉంటుంది. సరోజవెనక లకారాలు మూలుగుతున్నాయన్నసంగతి నాకు తెలీకపోలేదు. అయినా డబ్బుకోసం, నేను సరోజను పెళ్ళిచేసుకోను!' అని సుందరం తెగేసిచెప్పాడు.

ఆమె కేమీ పాలుపోలేదు. ఆసంగతే కూతురుకు కబురు పెట్టింది! నాలుగోనాటికల్లా పద్మ వచ్చిపడింది. వస్తూవస్తూ సరోజనుగూడా వెంటతీసుకొచ్చింది!

'వీళ్ళందరూ కలిసి, ఇక నాప్రాణం తీస్తారు కాబోలు!' అనుకొన్నాడు సుందరం!

అతను అనుకొన్నట్టుగా ఎవ్వరూ ప్రాణం తీయలేదు గానీ, పద్మమాత్రం లాంఛనప్రాయంగా అడిగింది!

'మరేమీఅనుకోకు అక్కయ్యా! నువ్వంటే నాకుచాలా అపేక్షఉంది. నువ్వేంచెప్పినా చేస్తాను. కానీ, సరోజనుమాత్రం పెళ్ళాడమనకు. కారణం నీకు తెలుసు. తెలిసో, తెలియకో నాన్న నీ కాసంబంధం చేశాడు. చేసినతరువాత ఆయన చాలా పశ్చాత్తాపపడ్డాడు! ఆజబ్బు అనాదినుంచీ ఆ వంశంలో ఉంది. ఆ జబ్బుతోనే బావగారూ పోయారు. ఆయనకూతుర్ని నన్ను

చేసుకోమంటున్నావంటే—దానికి అర్థం లేదు.' అన్నాడు సుందరం.

పద్మ ఓక్షణంపమీ మాట్లాడలేదు. దీర్ఘంగా నిట్టూర్చింది!

'ఏమైనా నీకిది తప్పదురా తమ్ముడూ! మనం పరాయి వాళ్ళంకాదు. ఓ తల్లిబిడ్డలం. నాకూ మొగ దిక్కు లేదు. వక్క గానొక్క ఆడపిల్ల. అవతల కట్టుకుపోయినంత ఆస్తిఉంది. సరోజను ఇంకెవడికో ఇచ్చి, ఈ ఆస్తంతా వాడి కప్పగించడం నా కిష్టంలేదు నాలుగు తరాలవరకూ అనుభవించినా తరగని ఆస్తి అది. నామాట విను. కాదనకు. తరవాత చాలా విచారిస్తావు.' అన్నది పద్మ.

'అక్కయ్యమాట విను నాయనా! మీనాన్న ఉన్న దంతా హారతికర్పూరంలా హారించి పారేశాడు. చివరికి బీడీ కొట్టు పెట్టుకొని, బ్రతకాలిసొచ్చింది! ఎంత చిన్నతనమైన పని! అవతల లక్ష్మి వస్తానంటున్నది. నువ్వు రావొద్దని చెప్పవాకు. నా మాట విను.' అన్నది తల్లి.

'మనమేమీ హీనంగా బ్రతకడం లేదే.' అన్నాడు సుందరం. 'అక్కయ్య, మననేదో ఉద్ధరించడానికి వొచ్చిందా నల్లే మాట్లాడుతోందేం! మన దరిద్రాన్ని అంతగా చూడలేక పోతే, పోనీ, ఓ పాతిక ఎకరాలు మనకివ్వగూడదూ? బోలెడంత ఆస్తి ఉంటే మాత్రం సరోజ క్షయరోగి బిడ్డ కాకుండా పోతుందా?' అన్నాడు సుందరం.

ఆరోజు సాయంత్రం పెందరాడే కొట్టుకట్టేసి ఇంటికొచ్చాడు సుందరం. తల్లిగానీ, సరోజగానీ ఇంట్లో లేరు. పద్మ ఓగదిలో ముసుగు పెట్టుకు పడుకొని ఉంది!

'వాళ్ళేరీ అక్కయ్యా? నువ్వు ముసుగుపెట్టుకు పడుకొన్నావెందుకూ?' అన్నాడు సుందరం.

పద్మ లేచి కూచుంది. ఆమె కళ్ళనిండా నీళ్ళున్నాయి.

'ఏం జరిగిం దక్కయ్యా?' అన్నాడు సుందరం ఆదుర్దాగా.

పద్మ కొన్నిక్షణాలు మౌనంగా ఉండిపోయింది. తరువాత మెల్లగా తలెత్తి సుందరంకేసి చూస్తూ 'తమ్ముడూ! ఈ సంగతి ఇంతవరకూ, రెండో ప్రాణికి తెలియదు. నీక్కూడా తెలియకుండానే ఉంచుదామనుకొన్నాను గానీ, వీల్లేకపోయింది... సుందరం! ఈసంగతి, నీకడుపులో దాచుకొంటానని నాకు మాటివ్వు' అన్నది పద్మ.

సుందరం అక్కచేతిలో చేయి వేశాడు. పద్మ ఓనిమిషం ఆలోచిస్తూ ఉండిపోయింది.

'నాపాడుకథ, తోబుట్టువుతో చెప్పుకోవాలిసొస్తుందని కల్లోకూడాఅనుకోలేదు.' అనిగొణిగిందిపద్మ. 'సుందరంసరోజను చేసుకోకపోడానికి కారణం, అది క్షయరోగికూతురనేగదూ?'

అవునన్నట్టు తలూపాడు సుందరం.

'తమ్ముడూ! నన్ను మన్నించు... సరోజ ఆతండ్రికూతురు గాదు... ఆయన రోగిష్టివాడన్న సంగతి నీకూ తెలును. అలాంటి వాడితో నేను అనుభవించే సుఖమేమిటి? ఈసంగతి నీతో చెప్పకుండా ఉందామనుకొన్నాను... కానీ నన్నలా ఉండనిచ్చావు గాదు ఇక నీఇష్టం సుందరం! నిన్ను నేను బలవంత పెట్టను. సరోజను చేసుకొంటావో, మానుతావో నాకు తెలీదు.'

పద్మ చేతుల్లో ముఖం దాచుకొని వెళ్ళిపోయింది. సుందరం దిమ్మెరపోయాడు.